# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
**75** పైసలు

సంవత్సర చందా
రూ. **9/-**

మహిళాజ్యుల కథా సంవిధానం గల
మహత్తర కుటుంబ గాథా చిత్రం

# వస్తోంది!

ఎం.వి.ఆర్.పిక్చర్స్ వారి

# ముహూర్త బలం

డైరెక్టర్ ఎం. మల్లికార్జునరావు * ప్రొడ్యూసర్స్ ఎం.వి.రామదాసు, యర్రా సత్యనారాయణ
నిర్వహణ డి.శ్రీరామమూర్తి * కో-ప్రొడ్యూసర్ ఎం.బాజీరావు




GOTETI

ఆంధ్రప్రదేశ్ విడుదల: ఈస్టిండియా

# అన్నివంటలకు శ్రేష్ఠమైన నూనెలు




అగ్‌మార్కు కాబడిన ఎ.యస్. బ్రాండ్ చాయపప్పు నూనె




అగ్‌మార్కు కాబడిన మేన్షన్ బ్రాండ్...... నువ్వులనూనె

- గింజావరిదెల్లు నువ్వులనుండి ఆరోగ్యకరముగు ప్రత్యేకపద్ధతులతో తయారుకాబడినవి.
- రుచి, రంగు, సువాసనలతో అన్నివంటుపదార్థములకు అమితమగురుచి అనంతముగ చేయును.
- ఈ రోగాయలను చాలకాలము నిలువయుండును, ముక్కును మెత్తబడనీయవు, బూజుపట్టనీయవు.
- తలకు వాడినయెడల మెదడుకు చలువ చేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16, 4, 2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

ఏజెంట్లు:

శ్రీ మాజేటి వీరరాఘవయ్యా,
కమీషను మర్చంటు,
శివాలయం వీధి, విజయవాడ

Ms. పెరుమాళ్ళు & కో,
137, అదియప్పనాయక్ స్ట్రీట్,
మదరాసు

Ms. B.V. రావు & కో,
136, పురశువాకం హైరోడ్, మదరాసు

MFRS. అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట







New

Teeth Cleaning Unit

'Kashmir'

TOOTH PASTE
TOOTH POWDER
and
TOOTH BRUSH

by

THE NATIONAL TRADING CO.

Manufacturers of

KASHMIR SNOW BEAUTY AIDS

BOMBAY-2. MADRAS-32.

# ఈ 'బ్రిజిల్' కొనల్ని భూత అద్దము క్రింద పోల్చి చూడండి



# బినాకా
## టూత్ బ్రష్

క్షేమకరమైన 'గుండ్రని బ్రిజిల్' కొనలతోకూడి చిగుళ్లను తెగనీయదు
REG. PAT. NO. 69453

## పరిశుభ్రముగా తోమండి
## క్షేమకరముగా తోమండి
## బినాకా తో తోమండి

C I B A



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మానవచరిత్రలో ప్రపంచాన్ని కబళిం చాలన్న దురాశతో రక్తపాతాలు చేసిన వారెందరో ఉన్నారు. కాని చివరకు మానవరక్తమే జయిస్తూ వస్తున్నది. ఈ చక్కని నీతిని "వింతఏముక" మనకు బోధిస్తున్నది.

మనుషులు స్వార్థం కొద్దీ దైవభక్తి అవలంబించవచ్చు. కాని దైవభక్తి లాభం చేకూర్చుతుందా అన్నది ఎవరూ చెప్పలేరు. "చూశాను! చూశాను!" అన్న కథ ఇందుకొక నిదర్శనం.

సంపుటి 42 జనవరి '68 సంచిక 1



# భారత చరిత్ర




వొడ్‌గాంవ్ వద్ద ఇంగ్లీషువారు తమకు అవమానకరమైన సంధి చేసుకున్నారు. ఈ సంధి ప్రకారం, బొంబాయి ప్రభుత్వం 1773 తరవాత ఆక్రమించుకున్న ప్రాంతాలన్నీ విడిచి పుచ్చాలి; బెంగాలు నుంచి వచ్చిన బలాలను ఉపసంహరించాలి, బ్రోచ్ నుంచి వచ్చే ఆదాయంలో సింధియాకు కొంత వాటా ఇవ్వాలి.

గవర్నరుజనరలైన వారన్ హేస్టింగ్స్ ఈ సంధిని పూర్తిగా నిరాకరించాడు. దీని వల్ల కలిగిన అపఖ్యాతిని ఎలా కడిగేసుకోవాలో అతనికి తెలియులేదు. ఈసారి మిగతా కౌన్సిలు సభ్యులు ఆయనతో ఏకీభవించారు. కర్నల్ గొడార్డ్ అనేవాడి నాయకత్వం కింద ఒక పెద్ద సేన బెంగాలు నుంచి బయలుదేరి, మధ్య ఇండియా మీదుగా వెళ్ళి, 1781 ఫిబ్రవరి 15 న అహమ్మదాబాదునూ, అంతకు ముందు డిసెంబరులో బస్సీన్‌నూ పట్టుకున్నవి. ఏప్రిల్ 1781 లో ఈ సేన పూనా మీదికి వెళ్ళి, అపజయం పొంది వెనక్కు తగ్గటం జరిగింది. వారన్ హేస్టింగ్స్ పంపిన ఇతర సేనలు ఆగస్టు 3 న గ్వాలియరును పట్టుకున్నాయి; ఫిబ్రవరి 16 న శివపురి (సిప్రి) వద్ద సింధియాను ఓడించాయి.

ఈ విజయాలతో ఇంగ్లీషువారి ప్రతిష్ఠ పెరిగింది. అంతదాకా మహారాష్ట్ర సమాఖ్యకు మహానాయకుడు కావటానికీ, ఉత్తరదేశంలో తన అధికారం చలాయించటానికీ ఆలోచనలు చేసిన మహాదాజీ సింధియా, ఇప్పుడు పథకం మార్చి, ఇంగ్లీషువారి సఖ్యం కొరకు అర్రులు చాచాడు. ఆయన ఇంగ్లీషువారితో మంతనాలు జరిపి, వారికీ, పూనా ప్రభుత్వానికీ మధ్య రాజీ కుదుర్చుతానని, 1781 అక్టోబరు 13న మాట ఇచ్చాడు. 1782 మే 17న సల్‌బై

సంధి జరిగింది. అయితే 1783 ఫిబ్రవరి 26 దాకా నానా ఫడ్నవిస్ దానిపై సంతకం చెయ్యలేదు. ఈ ఒప్పందం ద్వారా ఇంగ్లీషు వారికి సాల్సెట్ ఖాయ పరచబడింది; మాధవరావు నారాయణ్ పేష్వా పదవికి హక్కుదారుగా గుర్తించబడ్డాడు; రఘో బాకు పింఛను ఇవ్వబడింది; యమునకు పశ్చిమంగా ఉండే సింధియా రాజ్యభాగం సింధియాకు తిరిగి వచ్చింది; ఆర్కాటు నవాబు నుంచి హైదరాలీ గెలుచుకున్న ప్రాంతమంతా తిరిగి అప్పగించాలని ఈ ఒప్పందంలో ఉన్నది. అయితే హైద రాలీకి ఈ ఒప్పందంతో ప్రమేయం లేదు.

ఈ విధంగా ఈ ఒప్పందం యుద్ధ పూర్వ పరిస్థితిని తిరిగి ఏర్పాటు చేసింది. ఇంగ్లీషు వారు ఎంతో నష్టపోయి కూడా, ఈ సంధి ద్వారా ఏమంత లాభం గడించలేక పోయారు. ఆ కారణం చేతనే వారన్ హేస్టింగ్స్ అక్రమ ఆర్థిక చర్యలకు పాల్పడ్డాడు. అయినప్పటికీ మన దేశంలో ఇంగ్లీషువారి ఆధిపత్యం కొనసాగటంలో ఇదొక ప్రముఖ ఘట్టం అయింది. దీని మూలంగా వారికి మహారాష్ట్రులతో ఇరవై ఏళ్ళపాటు అశాంతి లేకుండా పోయింది. ఆ కాలంలో వారు ఫ్రెంచి వారితోనూ, టిప్పుసుల్తాను లాటి ఇతర విరోధులతోనూ



స్వేచ్ఛగా పోరాటాలు సాగించగలిగారు; నిజామునూ, ఔధ్ నవాబునూ లొంగదీసుకోగలిగారు.

అంత మాత్రం చేత ఈ సల్‌బై సంధి ఇండియాలో బ్రిటిషు పరిపాలనకు పునాది అయిందని చెప్పటం అతిశయోక్తి అవుతుంది. ఒక విషమపరిస్థితి నుంచి బ్రిటిషు వారు బయటపడిన మాట నిజమేగాని, వారికింకా మహారాష్ట్రులతోనూ, టిప్పుతోనూ వైరం ఉండనే ఉన్నది. పంజాబు, నేపాలు, బర్మాలలో వారిని ప్రతిఘటించే శక్తులు ఉద్భవిస్తూనే ఉన్నాయి.

హేస్టింగ్స్ వెళ్ళిపోయి, కార్న్‌వాలిస్ గవర్నరు జనరలుగా వచ్చే మధ్యకాలంలో ఆ పదవి నిర్వహించిన మక్‌ఫర్సన్ అసమర్థుడు. అదీగాక దేశ రాజకీయ వ్యవహారాలలో కంపెనీవారు జోక్యం కలిగించుకోరాదంటూ బ్రిటిషు పార్లమెంటు ఒక శాసనం చేసింది. ఈ కారణంచేత కార్న్‌వాలిస్ హయాములో కూడా కంపెనీకి రాజకీయ సంబంధమైన కార్యకలాపాలేవీ లేకపోయాయి.

ఈలోపల మహారాష్ట్ర సమాఖ్య పరిస్థితి ఎలా ఉన్నది? సంకోచాలతోనూ, కుట్రలతోనూ ఛిన్నాభిన్నమయి పోతున్న మహారాష్ట్ర సమాఖ్యకు రాణీ అహల్యాబాయీ, మహాదాజీ సింధియా, నానా ఫడ్నవిస్ లాటి మహామహులు జీవంపోశారు. అహల్యాబాయి తన రాజ్య నిర్వహణలో అత్యంత ఆదర్శప్రాయురా లనిపించుకున్నది. తన కాలపు రాజకీయాలలో ఆమె వహించిన పాత్ర అద్వితీయమైనది. అహల్యాబాయి 1795లో చనిపోగా, తుకోజీ హోల్కర్ ఇందోరు సింహాసనం ఎక్కాడు. ఇతను మంచి యోధుడేగాని, రాజకీయ ప్రావీణ్యం గలవాడు కాదు. 1797లో ఇతను మరణించినాక ఇందోరులో అరాజక పరిస్థితి ఏర్పడింది.






# వింత ఎముక

పూర్వం సువర్ణదేశాన్ని సుచంద్రు డనే రాజు పాలించేవాడు. ఆయన యాభై ఏళ్ళుగా రాజ్యం చేసి, పరిసర దేశాలెన్నిటినే జయించి తన రాజ్యంలో కలుపుకున్నా, ఆయన కింకా రాజ్యదాహం తీరనేలేదు.

ఒక రోజు రాజు వేటకు బయలుదేరాడు. తన దేశానికి ఉత్తరపు సరిహద్దున ఉన్న కొండలలో వేటాడుతూ ఆయన ఒక లేడి వెంట అనేక మైళ్ళు పరిగెత్తాడు. చివరకు లేడి ఎటో అదృశ్యమయింది. గుర్రం అలిసి పోయింది. రాజూ అలిసిపోయాడు. మిట్ట మధ్యాహ్నమయింది. రాజు ఒక చెట్టు కింద నిలబడి, లేడి మాయమైపోయిన దిక్కుగా చూశాడు.

రాజు కంటపడిన ప్రకృతి దృశ్యాలు ఆయనను ఆశ్చర్యపరిచాయి. ఇంకా ఉత్తరంగా దూరాన ఎత్తయిన పర్వతా లున్నాయి. తాను నిలబడిన చోటికీ ఆ పర్వతాలకూ మధ్య ఉన్న ప్రకృతి ఎంతో అందంగా, వనదేవత నివాసం లాగా నేత్ర పర్వంగా ఉన్నది. ఏపుగా, గుమ్మటాల లాగా పెరిగిన చెట్లూ, తివాసీ లాటి గడ్డీ, మధ్యగా మెలికలు తిరిగి పారే ఏరూ, దూరాన ఆలయ గోపురాల లాటి దేవదారు చెట్లూ, ఒక పక్కగా ఒక చిన్న, అందమైన నగరమూ రాజు కళ్ళపడ్డాయి.

ఆ దృశ్యం చూసి తన్మయత్వంలో మునిగి ఉన్న రాజును అతని సామంతులు వచ్చి కలుసుకున్నారు. రాజు వాళ్ళ కేసి తిరిగి, "నా రాజ్యంలో ఇంత అందమైన ప్రాంతం ఉన్నట్టు నా కింతవరకూ తెలి యనే తెలియదు సుమా !" అన్నాడు.

సామంతులు రాజుతో, "మహారాజా, ఆ కనిపించే ప్రదేశం మన రాజ్యంలోది కాదు. తమ రిప్పుడు నిలబడి ఉన్నదే మన రాజ్యపు సరిహద్దు," అన్నారు.

కె. ఉమామహేశ్వరరావు



రాజు దబ్బతిన్న వాడిలాగా అయిపోయి, "ఆ కనిపించే దంతా నా రాజ్యం కాదా?" అని అడిగాడు.

"కాదు, మహారాజా. అదొక స్వతంత్ర రాజ్యం. అందులో పల్లెకారులు మాత్రమే ఉంటారు," అన్నారు సామంతులు.

రాజు పళ్ళు పటపటా కొరికి, "పల్లెకారులూ, స్వతంత్ర రాజ్యమూనా? ఇవాళే సేనలను పంపి, ఆ కనిపించే పర్వతాల దాకా మన రాజ్యంలో కలిపెయ్యండి," అని ఆజ్ఞ ఇచ్చాడు.

వెంటనే రాజాజ్ఞ అమలు జరిగింది. అతి మనోహరమైన పల్లెకారుల స్వతంత్ర రాజ్యం లోకి సుచంద్రుడి సైనికబలాలు ప్రవేశించి విధ్వంసక చర్యలు ప్రారంభించాయి. సైనికుల దుందుభులతోనూ, అట్టహాసాలతోనూ అక్కడి ప్రశాంతతకు భగ్నం కలిగింది. అక్కడి నిర్మలమైన వాగులలో పల్లెకారుల రక్తం కూడా కలిసి ప్రవహించ సాగింది.

తన సైన్యాన్ని చూస్తూనే పల్లెకారులు తనకు పాదాక్రాంతులై తమ స్వాతంత్ర్యాన్ని తనకు కానుకపెట్టి, తమ నగరానికి ఆహ్వానిస్తారని సుచంద్రుడు అనుకున్నాడు. కాని అలా జరగలేదు.

మూడురోజులు యుద్ధం జరిగింది. పల్లెకార్ల నగరం శ్మశానం లాగా అయింది. అయినా పల్లెకార్లు లొంగి రాలేదు. పగలల్లా వాళ్ళు తమకున్న అయుధాలతో పోట్లాడారు. స్త్రీలూ, పిల్లలూ కూడా తమ దేశం కోసం ప్రాణాలర్పిస్తామని శపథం చేశారు. రాత్రి కాగానే వాళ్ళు గాయపడిన తమ వారికి కట్లు కట్టి, చచ్చిపోయిన వారిని పాతిపెట్టి, మళ్ళీ తెల్లవారుతూనే యుద్ధానికి సిద్ధమవుతున్నారు.

నాలుగోరోజు ఉదయం సుచంద్రుడు తన గుడారంలో కూర్చుని, ఆ రోజు జరగవలసిన యుద్ధం గురించి తంత్రాలోచన

చేస్తుండగా, ఆయనను చూడాలని ఎవరో వృద్ధుడు వచ్చినట్టు పహరావాళ్ళు చెప్పారు. ఆ వృద్ధుడు గూఢచారి కాడని రూఢి అయితే లోపలికి రానివ్వవచ్చునని రాజు వాళ్ళతో అన్నాడు.

వృద్ధుడు చాలా బలహీనంగా ఉన్నాడు. అతని వద్ద ఆయుధ మేదీ లేదు. అందు చేత అతన్ని భటులు రాజు వద్దకు తీసుకువచ్చారు.

"ఎవరు నువు? ఏం పనిమీద వచ్చావు? నీతో చాలాసేపు మాట్లాడటానికి నాకు వ్యవధి లేదు. మేము అతి ముఖ్యమైన ఆలోచనలో ఉన్నాం," అన్నాడు రాజు.

"తమ దర్శనం కోసమే వచ్చాను, మహారాజా!" అన్నాడు వృద్ధుడు.

"శత్రుదేశంవాడివా? పల్లెకారివా?" అని రాజు అడిగాడు.

"లేదు, మహారాజా. నేను తమ పౌరుణ్ణే. నా గుడిసె ఈ సమీపంలోనే ఉన్నది," అన్నాడు వృద్ధుడు.

"నీకేం కావాలి నానుంచి?" అని రాజు అడిగాడు,

వృద్ధుడు చిన్న ఎముకముక్కను చూపి, దాని ఎత్తు బంగారం ఇస్తే తన కింకేమీ అక్కర్లే దన్నాడు.



రాజు వృద్ధుడి చేతిలోని ఎముక కేసి చూసి, "అంత కొద్ది బంగారమా కోరావు? అది చిన్న మెత్తు కూడా ఉండదు. ఈ బంగారు నాణెం తీసుకుని వెళ్ళిపో," అంటూ ఒక మొహరు విసిరాడు.

"తూచి, ఈ ఎముక ఎత్తు మాత్రమే ఇప్పించండి, మహారాజా! నేను దురాశా పరుణ్ణి కాను," అన్నాడు వృద్ధుడు.

వృద్ధుడి సంతృప్తి కోసం రాజు చిన్న త్రాసు తెప్పించి, ఒక పళ్ళెంలో వృద్ధుణ్ణి ఎముక నుంచమని రెండో పళ్ళెంలో మొహరు నుంచాడు. ఎముకే బరువుగా ఉన్నట్టు స్పష్టమయింది. రాజుకు ఆశ్చర్య

మయింది. మరి కొన్ని మొహర్లు వేశాడు. లాభం లేకపోయింది. తన దగ్గిర ఉన్న మొహర్లన్నీ వేసి, తన ఒంటి మీది బంగారు ఆభరణాలన్నీ వేసినా ఎముకే యింకా బరువుగా ఉన్నది.

"దీని ఎత్తు బంగారం తమ దగ్గిర లేక పోతే పోనివ్వండి, మహారాజా. నా దారిన నేను పోతాను," అన్నాడు వృద్ధుడు.

"ఆగు! ఇందులో ఏదో మాయా, మోసమూ ఉన్నాయి. ఇంత చిన్న ఎముక ఇంత బరువు ఎలా తూగు తున్నది?" అన్నాడు రాజు.

"ఈ ఎముక దురాశ, మహారాజా. ప్రపంచంలో ఉన్న బంగార మంతా వేసినా దీని బరువుకు సమం కాదు," అన్నాడు వృద్ధుడు.

"అయితే ఈ దురాశతో తులతూగేది ప్రపంచంలో లేదంటావా?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

వృద్ధుడు తన సమీపంలో ఉన్న భటుడి కేసి తిరిగి, తన వేలికి గంటు పెట్టమని, తన రక్తం బొట్టుతో ఎముకను తుల తూచాడు. ఎముక ఉండే పళ్ళెం పైకి లేచిపోయింది.

"మహారాజా, నేను వృద్ధుణ్ణి. నా రక్తం పలచబడి పోయింది. ఇదే పసివాళ్ళ రక్తమూ, యువకుల రక్తమూ అయితే ఇంకా ఎంత బరువో ఆలోచించండి. నాకు సెలవిప్పించండి," అంటూ వృద్ధుడు బయటికి వెళ్ళిపోయాడు.

రాజు కొంతసేపు దిగ్భ్రమచెంది, కొయ్యబారి పోయినట్టుగా ఉండి పోయి చివరకు, "యుద్ధం ఆపండి. సైనికుల నందరినీ వచ్చెయ్యమనండి!" అని ఆజ్ఞ ఇచ్చాడు.

ఆ రోజే యుద్ధం నిలిచిపోయింది. రాజు తన సేనలతో సహా తన నగరానికి తిరిగి వెళ్ళిపోయాడు. ఆ తరవాత ఆయన ఏ దేశం మీదా దండెత్త లేదు.





# శిథిలాలయం

ారుప్ప కనుమల్లోని పర్వతారణ్య ంతాల్లో శబరజాతి వాళ్ళు నివశించే ్లెలు అనేకం వుండేవి. వాటిలో కుంభార ట్ట అనే పల్లెకు శివాలుడు అనే వాడు యకుడు. అతడు అరవైఏళ్ళు పైబడిన ద్ధుడు. అతడికి పద్దెనిమిదేళ్ళ యీడు డైన శిఖిముఖి అనే కుమారుడున్నాడు.

శిఖిముఖి అంటే తండ్రికి పంచ ాణాలు. అందుక్కారణం అతడు శివా డికి నడివయసు దాటింతర్వాత కలిగిన క సంతానం కావటం.

తన తరవాత పల్లెకు నాయకత్వం ాంచవలసిన వాడు శిఖిముఖి కావటం త శివాలుడు కొడుక్కి బాల్యప్రాయం ీ తగిన గురువులను పెట్టి కర్ర కత్తి సాము, అరణ్యంలో, నదుల్లో వేటాడి ఆహారం సంపాదించే విద్యలూ నేర్పించాడు. వీటన్నిటిలో శిఖిముఖి తన పదిహేనవ ఏట నుంచే నిపుణుడనిపించుకున్నాడు. కుంభార మిట్టలోనే గాక, ఆ చుట్టు పక్కల వున్న మరే శబరపల్లెలో కూడా అతణ్ణి మించిన వేటకాడూ, ధైర్యశాలీ, ఉపాయశాలీ లేడు.

శిఖిముఖిని నలుగురూ మెచ్చుకునేప్పుడు శివాలుడు ఎంతో సంతోష పడేవాడు. కాని, అంత సంతోషంలోనూ అతడికి కొడుకును గురించి అపగింజంత విచారం కూడా వుండేది. తనలాగే కొడుకును కూడా చదువ రాయ నేర్చిన వాణ్ణిగా చేయాలని శివాలుడు ఎంతో ప్రయత్నించాడు. కాని, అది ఫలించలేదు.



కుంభారమిట్టకు చుట్టూ, నూరు నూట యాభై కోసుల దూరంలో చదవటం రాయటం చేతనైన శబరజాతి వాడు ఒక్క శివాలుడు తప్ప మరెవరూ లేరు. శబరులు ఆటవికులు. అరణ్యాలూ, కొండలే వాళ్ళ నివాసస్థానాలు. వేటా, పశు సంపదే వాళ్ళ జీవనాధారం. వాళ్ళకు నగర జీవితం తెలీదు, నాగరికులతో ఎలాంటి పొత్తూ లేదు. ఆ పరిస్థితుల్లో చదువు సంధ్యల్లాంటివి వాళ్ళకు కొరగాని విషయాలుగా కనబడ టంలో ఆశ్చర్యం లేదు. కాని, శివాలుడు యువకుడుగా వున్నప్పుడు ఒక క్షత్రియుడి వెంట దేశదేశాలూ తిరిగి రణకౌశలం,

చదువారాయా నేర్చుకున్నాడు. వాటి జీవితంలో అతడికి ఎన్నో ప్రయోజన కనిపించినై. శిఖిముఖి మాత్రం యీ యంలో తండ్రికి చాలా ఆశాభంగం గించాడు.

రోజూ సూర్యోదయంతోనే శిఖిము విల్లంబులూ, ఈటే తీసుకుని, వేటకై ణ్యానికి పోతున్నానని తండ్రికి చెప్ప మామూలు. తిరిగి అతను అరణ్యాన్ను పల్లెకు రావటం సూర్యాస్తమయ తర్వాతనే.

ఒకనాటి ఉదయం శిఖిముఖి తం చెప్పి వేటకు బయలుదేరాడు. వె ఎర్రగండు అనే అతడి వేటకుక్క వున్న దాన్ని చిన్న పిల్లగా అతడే సాకి చేశాడు. అది ధైర్యంలో సింహం, జిత్తు గుంటనక్క. అరణ్యంలో వాళ్ళిద్ద ఒకళ్ళకొకళ్ళు తోడుగా తిరుగుతూ వేట వాళ్ళు. ఎర్రగండు పసిగట్టి ముందు చూపేది, శిఖిముఖి దాన్ని అనుసరి పోయి మృగాలను వేటాడేవాడు.

శిఖిముఖీ, ఎర్రగండూ అరణ్యం చాలాదూరం పోయారు. ఆ రోజెందుచే మిట్టమధ్యాహ్నం వేళ అయినా, వాళ ఒక్క లేడి గాని, అడవిదున్న గాని, అ



పందిగాని కనిపించలేదు. అరణ్యం ఎందు వల్లనో నిశ్శబ్దంగా వున్నది. అప్పుడప్పుడూ కోతులు చెట్లల్లో కిచకచ మంటూ అరిచి, కొమ్మల్లో దూరి దాక్కుంటున్నవి. ఎక్కడో సింహం, మరెక్కడో పులీ పరిగెత్తుతూ అరిచినట్టుగా ధ్వని ఇప్పు డిక్కడా మరు క్షణం మరో దిక్కు నుంచీ వస్తున్నది.

"ఇంత నిశ్శబ్దం ఏమిటి? అరణ్యాని కేమన్నా సుస్తీ చేసిందా? వేట జంతువు లన్నీ ఎక్కడ దాక్కున్నయి? సింహం, పులీ అలా బెదు రెత్తుతున్నయ్యేం?" అంటూ శిఖిముఖి ఎర్రగండు కేసి చూశాడు. ఎర్రగండు నేల మూచూస్తూ కొద్ది దూరం పోయి, యజమాని వెంటరాక పోవటంతో, ఆగి చిన్నగా మొరగసాగింది.

శిఖిముఖి కుక్క కేసి గుచ్చి చూస్తూ, "ఏమిటీ, ఎండ తాపానికి నీ కేమైనా పిచ్చెత్తుతున్నదా? నీ మొరుగుడుకు చుట్టు పక్కల కోసు దూరంలో వున్న జంతువు లైనా బెదిరి పారిపోతై," అన్నాడు.

ఎర్రగండు కొద్ది సేపు వూరుకుని మళ్ళీ నేలను వాసన చూసి, ముందుకు పరిగెత్తి శిఖిముఖి కదలక పోవటంతో వెనుదిరిగి వచ్చి, అతడి చుట్టూ గిరికీలు కొట్ట సాగింది. కుక్క ప్రవర్తనకు ఆశ్చర్యపడుతూ శిఖి




ముఖి అక్కడున్న ఒక ఎండు మోడు పై కెక్కి నిలబడి కుక్క పరిగెత్తబోయిన దిక్కు కేసి చూశాడు. అతడికి ఒక్కగా నొక్క జంతువు గాని, మనిషి గాని కని పించ లేదు. కుక్క మాత్రం యింకా చిన్నగా మొరుగుతూనే వున్నది.

ఎర్రగండు కున్న పశికట్టే శక్తి గురించి బాగా తెలిసినవాడు కావటంతో శిఖిముఖి, కుక్కను ఓ సారి దువ్వి అందుబాటులో వున్న ఒక చెట్టు పై కెక్కి అక్కణ్ణుంచి, అది పరిగెత్తబోయిన దిక్కు కేసి పరీక్షగా చూశాడు. అతడి దృష్టి ఒక వింత ఆశ్వికుడి పైన పడింది. అశ్వం, రౌతూ కూడా కప





చాలు ధరించి వున్నారు. రౌతు నడుం నుంచి పొడవాటి కత్తి ఒకటి వేలాడు తున్నది. కుడిచేతిలో పెద్ద ఈటె నొకదాన్ని ఎత్తి పట్టుకుని వున్నాడు. దాని అలుగు నుంచి ఒక చిన్న పతాకం — ఎరుపూ పసుపూ రంగులు గలది, గాలికి రెపరెప లాడుతున్నది.

"ఇత నెవడో, అయ్య్య చెప్పే పురాణ కథల్లోని అతిరథుడో, మహారథుడో అయి వుంటాడు. వెంట రథం లేదే? ఆహాహ్, భలే వేషం!" అనుకుంటూ శిఖిముఖి నవ్వ సాగాడు. కవచాలు ధరించిన యోధుల్ని అత డింతవరకూ చూసి ఎరగడు. ఒకటి రెండుసార్లు రాజుగారి సైనికుల్ని చూశాడు గాని వాళ్ళిలా నిలువెల్లా కవచం ధరించి కనబడలేదు.

ఆ అశ్వికుడి కేసి వింతగా చూసున్న శిఖిముఖికి మరింత ఆశ్చర్యం, భయం కొలిపే మరొక దృశ్యం కంట బడింది. ఏడెనిమిది మంది మనుషులు — వాళ్ళ దుస్తుల తీరును బట్టి దారిదోపిడిగాళ్ళలా వున్నారు — అశ్వికు డొస్తున్న మార్గానికి పైన వున్న చెట్లకొమ్మల్లోంచి, అతడికి వెనకా ముందూ ఒక్కసారిగా కిందికి దూకారు. గుర్రం బెదిరించి. అశ్వికుడు దాన్ని కళ్ళెం లాగి ఆపుతూ, పెద్దగా సింహ నాదం చేసి, ఒర నుంచి కత్తి దూసి వాళ్ళతో తలపడ్డాడు.

శిఖిముఖికి ప్రమాదంలో చిక్కుకున్న ఆ అశ్వికుణ్ణి చూసి చాలా జాలి కలిగింది. ఒకడి మీద పదిమంది కత్తులెత్తటం అధర్మం, సహించరానిది. శత్రుబలం చూసి లొంగిపోక, అంతమందినీ ఏకాకిగా ఎది రించి పోరాటానికి ఉపక్రమించిన అశ్వికు డంటే అతడి కెంతో గౌరవభావం కలిగింది. అతడు ఎర్రగండును హెచ్చరించి, చెట్ల ఊడలు పట్టుకుని వూగుతూ, క్షణాల మీద అశ్వికు డున్న ప్రాంతం చేరాడు.



ఈ లోపల అశ్వికుడు వాహనం మీద వుండే దొంగలను కత్తితో ఎడాపెడా కొడుతూ, "విక్రమకేసరి కత్తి బలి కోరుతున్నది! నీచుల్లారా పారిపోక నిలబడండి, నా ప్రతాపం తెలుస్తుంది," అంటూ కేకలు పెడుతున్నాడు. ఇంతలో ఒక దొంగ, చాటుగా వుండి గుర్రం కాలికి గురిచేసి కత్తి విసిరాడు. గుర్రం గాయపడి వేగంగా పక్కకు తిరిగింది. అశ్వికుడు ఆ కుదుపుకు కిందపడి, అంతలోనే లేచి నిలబడి, ఈసారి కత్తి, ఈటె రెంటినీ రెండు చేతుల్లో పట్టుకుని, పెద్దగా హుంకరించి దొంగలను ప్రతిఘటించసాగాడు.



"శబరమాతకూ, జై!" అంటూ శిఖిముఖి చెట్టు మీది నుంచి దొంగల మధ్యకు దూకాడు. ఈలోపల ఎర్రగండు ఒక దొంగ మీది కురికి, వాడి కంఠం పట్టుకునేందుకు పైకెగిరింది. అశ్వికుడు ఒక్క క్షణకాలం యీ వచ్చినవాడు శత్రువో మిత్రుడో అన్న అనుమానంతో స్థాణువులా అయిపోయి, శిఖిముఖి ఈటెను దొంగల మీదికి గురిచేయటం చూసి, "మిత్రమా! యీ దుర్మార్గుల్లో ఒక్కణ్ణి కూడా ప్రాణాలతో పోనివ్వకూడదు," అని కేక వేశాడు.

ఇంతలో అరణ్యంలో ఎక్కడో దూరం నుంచి ఎవరో పెద్దగా ఈల వేశారు. మరుక్షణం దొంగలు అశ్వికుణ్ణీ, శిఖిముఖినీ విడిచి కలిసికట్టుగా అక్కణ్ణించి పారిపోసాగారు. బరువైన కవచం ధరించి వుండటంతో అశ్వికుడు వాళ్ళను వెంబడించలేకపోయాడు. శిఖిముఖి, ఎర్రగండూ వాళ్ళను కొంత దూరం తరిమి, వాళ్ళు అందకుండా గుబురు చెట్లల్లోకి పారిపోవటంతో వెనుతిరిగి అశ్వికుడున్న చోటుకు వచ్చారు.

వాళ్ళు వచ్చేసరికి అశ్వికుడు తన గుర్రానికి తగిలిన గాయాన్ని పరీక్షిస్తున్నాడు. శిఖిముఖి అతణ్ణి సమీపించి, "ఆ దుష్టులు





అందకుండా పారిపోయారు. ఈ అరణ్యంలో మీరు ఒంటరిగా ప్రయాణం చేయవలసింది కాదు. మీరేం గాయపడలేదు కదా?... అదృష్టం. గుర్రం గాయానికి మందు వేద్దాం వుండండి," అంటూ దాపుల నున్న చెట్ల దగ్గిరకు పోయి ఆకులు కోయసాగాడు.

ఆశ్వికుడు మారుమాట్లాడ కుండా శిఖిముఖిని నఖశిఖ పర్యంతం పరీక్షగా చూస్తూ వుండి పోయాడు. అతడికి ఈ యువకుడు ఆటవిక జాతివాడని తెలుస్తూనే వున్నది. శబరమాతకూ, జై, అంటూ దొంగల మధ్యకు దూకాడు. బాగానే వున్నది. నిజంగా యితడు శబరుడేనా? ఇందులో మోసం ఏమీ లేదు కదా—ఆశ్వికు డిలా ఆలోచిస్తున్నాడు.

శిఖిముఖి అశ్వాన్ని సమీపించి దాని గాయానికి ఆకుపసరు పూస్తూ, ఆశ్వికుడితో, "మీ పేరేమిటి? ఒంటరిగా అరణ్యంలో తిరుగుతున్నారేం?" అని ప్రశ్నించాడు.

ఆశ్వికుడు జవాబు చెప్పేందుకు ఓ క్షణ కాలం తటపటాయించి, "మనిద్దరం సమాన వయస్కులం, పద్దెనిమిదీ యిరవై ఏళ్ళ వయసు వాళ్ళం, అవునా? ముసలి వాళ్ళలాగా మీరూ మీరూ అని మాట్లాడు కోవటం ఎందుకు? అది సరే. నీ ప్రశ్న



లకు జవాబిచ్చే ముందు నే నొక ప్రశ్న అడగవలసి వుంది," అన్నాడు.

"ఏమిటా ప్రశ్న?" అని అడిగాడు శిఖిముఖి, ఆశ్వికుడి మాటలకు కొంచెంగా ఆశ్చర్యపడుతూ.

"నీవు శబరజాతివాడివి, అవునా?" అన్నాడు ఆశ్వికుడు.

"అవును, నా పేరు శిఖిముఖి. మీ... నీ పేరు?" అన్నాడు శిఖిముఖి.

"శిఖిముఖి!" అంటూ ఆశ్వికుడు కళ్ళింత చేసుకుని తలాడిస్తూ, "అది, నీ తాత పేరు. అవునా? నా పేరు విక్రమ కేసరి, యిది మా తాత పేరు. మీ తండ్రి



శివాలుడు, ఆ విక్రమకేసరిని గురించి నీకు చెప్పే వుండాలే. ఆయన క్షేమంగా వున్నాడు గదా?" అని ప్రశ్నించాడు విక్రమకేసరి.

విక్రమకేసరి మాటలు వింటూంటే శిఖిముఖికి ఏదో కల గంటున్నట్టుగా వున్నది. తను జన్మలో అతణ్ణి చూడటం తటస్థపడుతుందని అత డేనాడూ అనుకోలేదు...

"నా తండ్రి క్షేమంగానే వున్నాడు. మీ తాతగారిని గురించి నేను చాలా విన్నాను. మీది శూరసేన దేశం కాదా? నీ ప్రయాణం మా పల్లెకే అని తెలిసిపోయింది. కాని, యిదంతా నాకు నమ్మశక్యం కాకుండా వున్నది," అన్నాడు శిఖిముఖి

"ఇంకా నమ్మశక్యం కాని సంగతు లనేకం మీ ఇంటికి చేరింతరవాత తీరిగ్గా చెబుతాను. ఇంతకుముందు నన్ను చుట్టుముట్టినవాళ్ళు కేవలం దొంగలు కాదు. వాళ్ళకు కావలసింది, యీ జీనుకు వేలాడుతున్న సంచీయే కాక, నా ప్రాణం కూడా. కనక మనం త్వరగా మీ పల్లె చేరటం క్షేమం," అన్నాడు విక్రమకేసరి.

అసరికి శిఖిముఖికి తామున్న ప్రదేశం ఎంత ప్రమాదకరం అయిందో తెలిసివచ్చింది. దొంగలు ఏ చెట్లచాటునో పొంచి వుండి తిరిగి మీద పడేందుకు అవకాశం కోసం ఎదురు చూస్తూంటారు...

గాయపడిన గుర్రాన్ని నడిపించుకుంటూ శిఖిముఖి, విక్రమకేసరీ కుంభారమిట్ట పల్లెకు బయలుదేరారు. దారిలో శిఖిముఖి ఒక అడవిపందిని కొట్టి భుజాన వేసుకున్నాడు. దొంగల నుంచి మరే ప్రమాదం ఎదురపలేదు. కాని, చీకటి పడిన కొంత సేపటికి వాళ్ళు పల్లెను సమీపించేసరికి, శివాలుడూ మరికొందరూ అరణ్యం కేసి వస్తున్నారు. శిఖిముఖిని ముందుగా చూసిన పల్లెవాసులు కొందరు ఉత్సాహంగా కేకలు వేస్తూ, అతడి దగ్గరకు పరిగెత్తుకురాసాగారు. —(ఇంకా వుంది)






# వ్యర్థమైనవరం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదలకు సంతోషమే గాని, హేమంతరాయుడి కుమార్తె మాలిని పొందిన వరం లాగే నీ ప్రయత్నం కూడా వృధా అయిపోతుందేమో నని నా అనుమానం. శ్రమతెలియకుండా నీకు హేమంతరాయుడి కూతుళ్ళ కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

జయంతనగరంలో హేమంతరాయుడనే ప్రభు వొకడుండేవాడు. అయనకు ఇద్దరు కుమార్తెలు. పెద్దది మాలిని, చిన్నది నళిని. మాలిని చాలా బుద్ధిమంతురాలు, సాత్విక స్వభావం కలది, కాని అంత అందగత్తె కాదు. నళిని గొప్ప అందగత్తె, కాని

## బేతాళ కథలు




ఆమె స్వభావం దుడుకైనది, గర్వాతిశయా లతో కూడినది.

మాలినీ నళినీ కూడా యుక్తవయను వచ్చి పెళ్ళికి సిద్ధమయారు. కాని వాళ్ళకు తగిన వరుళ్ళను చూడటం హేమంతరాయు డికి పెద్ద సమస్య అయిపోయింది. పిల్లలకు సంబంధాలు చాలా వచ్చాయి. కాని ప్రతి యువకుడూ నళినిని చేసుకుంటా నేనేవాడే; మాలినిని చేసుకుంటానని ఒక్కడూ అన లేదు. పెద్దదాని పెళ్ళి చెయ్యకుండా, 'చిన్న దానికి ఎలా పెళ్ళిచెయ్యటం?

ఆ సమస్య అలా ఉంచి, రూపగర్విత అయిన నళినికి, వచ్చిన సంబంధాలలో ఒక్కడూ నచ్చలేదు. అందుచేత హేమంత రాయుడు చిన్న కుమార్తెకే పెళ్ళి చేసేద్దా మనుకున్నా అది సాగే దారి కనబడలేదు.

పరిస్థితి ఇలా ఉండగా ఒక సంఘటన జరిగింది. హేమంతరాయుడి చిన్ననాటి స్నేహితుడి కొడుకైన మాధవవర్మ అనే యువకుడు ప్రపంచం నాలుగు మూలలూ చూడాలనే ఉద్దేశంతో దేశసంచారం చేస్తూ జయంతనగరానికి వచ్చాడు.

ఈ మాధవుడు చాలా అందగాడూ, మంచి మేధావీనూ. ఏ యువకుడి చేతా ఆకర్షించ బడని నళినిని కూడా అతను బలంగా ఆకర్షించాడు. అతడు తన అందం చేత సమ్మోహితుడు కావాలని నళిని చాలా ప్రయాసపడింది. కాని నళిని అహంకార పూరితురాలని మాధవుడు గ్రహించాడు.

మాధవుడు జయంతనగరంలో కొద్ది రోజులు గడిపి ముందుకు సాగిపోవటానికి ప్రయాణం కట్టేటప్పుడు హేమంతరాయుడు అతనితో తన మనసులోని మాట బయట పెడుతూ, "నాయనా, నీ తండ్రీ నేనూ చిన్నతనంలో కట్టకట్టుకు తిరిగినవాళ్ళం. అందుచేత మన కుటుంబాల మధ్య బంధుత్వం ఏర్పడటం కన్న నాకు కోర దగిన దేముంటుంది? నా కూతుళ్ళ నిద్దరినీ

నువు ఇన్నాళ్ళూ చూశావు గద. వా రిద్దరికీ నీ పట అపారమైన స్నేహభావం ఉన్నట్టు నేను కనిపెట్టాను. అందుచేత ఆ ఇద్దరిలో ఎవతెను నువు పెళ్ళాడ గోరినా నేను సంతోషిస్తాను," అన్నాడు.

దానికి మాధవుడు, "మీ కోరిక చాలా ఉదారమైనదే. నేనే ఒక నిశ్చయానికి రా లే క పో తు న్నా ను. దానికి కారణమేమంటే, నేను నాకు కాబోయే భార్యలో సౌజన్యమూ, సౌందర్యమూ రెండూ కోరుతాను. దు ర దృ ష్ట వ శా న, ఈ రెండు గుణాలూ మీ కుమార్తె లిద్దరిలోనూ ఉండిపోయాయి. మాలినిలో సౌజన్యం ఉన్నది, నళినిలో సౌందర్యం ఉన్నది. అయినా మరొక సంవత్సరం లోపుగా నా దేశయాత్ర ముగించుకుని మా దేశానికి తిరిగి పోయేటప్పుడు ఇటుగానే వస్తాను. ఈ లోపుగా నా మనను ఏ నిశ్చయానికైనా వచ్చిన పక్షంలో మీ కోరిక తప్పక నెరవేర్చగలను. ఈ సారికి నన్ను క్షమించండి," అన్నాడు.

మాధవుడు వెళ్ళిపోయాక హేమంత రాయుడు తన కుమార్తెలతో అతనన్న మాటలు దాచకుండా చెప్పేశాడు. మాధవుడు తమను గురించి అన్న మాటలు విన్నాక మాలినిలోనూ, నళినిలోనూ కూడా



వేరువేరు పరిణామాలు వచ్చాయి. నిజానికి ఆ ఇద్దరూ మాధవుణ్ణి పెళ్ళాడ గోరినవాళ్ళే.

మాధవుడి మాటలకు మాలిని హతాశురాలు కాలేదు. తాను అందగత్తె కాదన్న సంగతి ఆమె ఎరుగును. కాని నళిని పూర్తిగా హతాశురాలై పోయింది. తన స్వభావం ఇతరులకు ఎలా కనిపించేదీ ఆమెకు తెలియదు; తెలిసినా లక్ష్యపెట్టలేదు. ఎందుకంటే తన సౌందర్యం ఎలాటి వాళ్ళనైనా జయిస్తుందని ఆమె పూర్తిగా నమ్మింది. మాధవుణ్ణి ఆ సౌందర్యం ఆకర్షించలేక పోయిందనీ, అందుకు తన స్వభావమే అడ్డొచ్చిందనీ తెలియగానే ఆమె




కుంగిపోయింది. ఆమెలోని గర్వమూ, అతిశయమూ క్రమంగా క్షీణించిపోయాయి.

మాలిని హతాశురాలు కాకపోవటమే గాక, తాను ఏం చెయ్యాలో కూడా నిశ్చయించుకున్నది. తనలో లోపించినది అందం మాత్రమే. మాధవుడు తిరిగి వచ్చే లోగా తాను సౌందర్యవతి కాగలిగితే అతను తప్పక తననే పెళ్ళాడతాడు. అందుచేత ఆమె సౌందర్యం సాధించాలని నిశ్చయించుకున్నది.

ఈ ఉద్దేశంతో మాలిని ఒక మంత్రోపాసకుణ్ణి వెతికించి పట్టుకుని, అతనితో తన కోరిక చెప్పింది. అరునెలల పాటు శ్వేతాంగి అనే యక్షిణిని అర్చించి, బలులు ఇచ్చినట్టయితే యక్షిణి ప్రత్యక్షమై మాలిని కోరిక తీర్చవచ్చుననీ, అర్చనానుష్ఠానాలు మాత్రం ఏ లోపమూ లేకుండా జరగాలనీ ఉపాసకుడు చెప్పాడు. ఎంత కఠోరమైన అనుష్ఠానమైనా అవలంబిస్తానని మాలిని చెప్పింది.

అరునెలల పాటు అంతా సక్రమంగా జరిగింది. యక్షిణి ఉపాసకుడి పైన ఆవేశించి, "అమ్మాయీ, నీ నిష్ఠకు సంతోషించాను. నా వల్ల నీ కేమి సహాయం కావాలి?" అని అడిగింది.

"తల్లీ, నన్ను నా చెల్లెలి కన్న సౌందర్యవతిగా చెయ్యి. నా కింకేమీ అవసరం లేదు," అన్నది మాలిని.

"తథాస్తు!" అని యక్షిణి ఉపాసకుడి మీది నుంచి దిగిపోయింది.

అటు తరవాత మాలినిలో కొంచెం కొంచెంగా మార్పు కలుగుతూ వచ్చింది. ఆమె క్రమంగా అందగత్తె అవుతూండటం అందరికీ కానవచ్చింది. శరీరచ్ఛాయ హెచ్చుతున్నది, కళ్ళు విశాలమవుతున్నాయి, చెక్కిళ్ళు పూడి నునుపు తేలుతున్నాయి. ఒక దశలో హేమంతరాయుడు తన ఇద్దరు కూతుళ్ళను చూసి, "మాలిని

నళినికి ఏమీ తీసిపోయేటట్టు లేదే? ఏమిటీ చిత్రం?" అనుకున్నాడు.

కాని త్వరలోనే ఆ అక్కచెల్లెళ్ళను చూసినవాళ్ళు, "అందంలో నళిని కన్న మాలినే ఒక పిసరు హెచ్చు. ఏమీ సందేహం లేదు," అనసాగారు.

"అక్క అదృష్టవంతురాలు. ఈ సారి మాధవుడు దాన్ని చూస్తే తప్పక పెళ్ళాడతాడు," అనుకున్నది నళిని.

చెప్పిన ప్రకారం మాధవుడు తిరుగు ప్రయాణంలో జయంతనగరానికి వచ్చి, హేమంతరాయుడికి అతిథిగా ఉన్నాడు. పూర్వం లాగే మాలినితోనూ, నళినితోనూ మాట్లాడి చూశాడు. రెండురోజులు గడిచాక అతను హేమంతరాయుడితో, "మీరు నన్ను మీ అమ్మాయిలలో ఎవరినైనా పెళ్ళాడమని ముందు అన్నారు. నా మనస్సులో నిర్ణయం జరిగితే మీకు చెబుతానన్నాను. నిర్ణయం జరిగింది. నేను మీ రెండో అమ్మాయి నళినిని పెళ్ళాడటానికి సిద్ధంగా వున్నాను," అన్నాడు.

హేమంతరాయుడు పరమానంద భరితుడయాడు. పెద్దపిల్ల అయిన మాలినిని ఇప్పుడు పెళ్ళాడటానికి చాలామంది సిద్ధంగా ఉన్నారు. మాధవుడు తనను ఎన్నుకోనందుకు మాలినికి చాలా కోపం



వచ్చింది. మాధవుడి కన్న పెద్ద స్థితిలో ఉన్నవాణ్ణి పెళ్ళాడతానని శపథం పట్టి, ఆమె అంతపనీ చేసింది. హేమంతరాయుడు తన ఇద్దరు కుమార్తెలకూ ఒకేసారి పెళ్ళిళ్ళు చేసి, వారిని అత్తవారి ఇళ్ళకు పంపేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మాధవుడు మాలినిని ఎందుకు చేసుకోలేదు? ఆమె నళిని కన్న కూడా సౌందర్యవతి అయింది కద? ఆమెలో మొదట ఉన్న లోపం యక్షిణీ వరంతో తీరిపోయింది కద? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మాలిని సౌందర్యవతి కావటం కోసం తన సౌజన్యాన్ని పోగొట్టుకున్నది. యక్షిణీ వరం కోసం ఆమె ప్రయత్నించడంలో స్వార్థమూ, చెల్లెలి పట్ల అసూయా ఉన్నది. నళిని కూడా తన లోపాన్ని సరిదిద్దుకున్నది. ఆమె తన అహంకారాన్నీ, అతిశయాన్నీ విడిచిపుచ్చింది. అందుకు కారణం ఆమెకు మాధవుడి పైన ఉండిన గాఢమైన ప్రేమ మాత్రమే. మాధవుడు రెండోసారి వచ్చి మాలినితోనూ, నళినితోనూ మాట్లాడినప్పుడు, వారిలో ఎవరు తనను నిజంగా ప్రేమించేదీ తెలుసుకుని ఉంటాడు. తనకు కావలసిన సౌజన్య సౌందర్యాలు నళినిలోనే ఉన్నట్టు అతను గ్రహించి ఉంటాడు. అతను నళిని సౌందర్యంతో అదివరకే తృప్తిపడ్డాడు. అందుచేత అంతకన్న సౌందర్యవతి అయిన మాలిని కోసం ఆశ పడలేదు. మాధవుడు కేవల సౌందర్య విమోహితుడే అయి ఉంటే మొదటనే నళినిని పెళ్ళాడి ఉండేవాడు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# లక్ష్మీ కటాక్షం

మధురానగరంలో రాఘవయ్య అనే బ్రాహ్మణయువకు డుండేవాడు. అతనికి "నా" అనే వాళ్ళెవరూ లేరు. పరమ దరిద్రుడు. అయినప్పటికీ ఇతరులను చెయ్యి చాచి యాచించి ఎరగడు. వూళ్ళో ఉండే వైష్ణవాలయాన్ని అంటి పెట్టుకుని ఉండి, ఆలయంలోని దేవతలను భక్తితో కొలుస్తూ, అక్కడ యిచ్చే ప్రసాదంతో కడుపునింపు కుంటూ ఉండేవాడు. మనిషి చూడటానికి ఆరోగ్యంగా, పుష్టిగా, ఎంతో కళగా ఉండేవాడు.

ఒకనాడు రాఘవయ్యకు కలలో లక్ష్మి దేవి కనబడి, "నాయనా, నాకు నీ పైన అనుగ్రహం కలిగింది. ఇక నుంచీ నేను నీ వెంట ఉండి, నీకు సకలైశ్వర్యాలూ చేకూర్చుతాను," అన్నది.

రాఘవయ్య లక్ష్మిదేవికి నమస్కారం చేసి, "తల్లీ, నీకు నా పైన దయ కలిగి నందుకు సంతోషం. కాని, ఇంతకాలమూ నీ కటాక్షం లేని కారణం చేతనే నేను నిశ్చింతగా బతుకుతున్నాను. నన్ను గురించి ఒకరికి గాని, ఒకరిని గురించి నాకు గాని బెంగ లేదు. ఏదో ఆ పూజారి ఇచ్చిన దాంతో పొట్టనించు కుంటూ కాలక్షేపం చేస్తున్నాను. అందుచేత, నీకు వెయ్యి నమస్కారాలు చేస్తాను, నువ్వు నాకు వద్దు!" అన్నాడు.

లక్ష్మిదేవి కోపంగా, "వెర్రి వాడా, ప్రారబ్ధం అంత తేలిగ్గా తప్పుతుందను కుంటున్నావా? నేను నిన్ను పట్టే తీరు తాను," అన్నది.

"తల్లీ, ఒక్క చిన్న విన్నపం. నువ్వు నన్ను ఎప్పుడు వదిలి పోతావే, అది కాస్త చెప్పు, చాలు," అన్నాడు రాఘవయ్య.

"నీతో చెప్పే పోతాను లే," అంటూ లక్ష్మిదేవి అతని కోక గుర్తు చెప్పి మాయమయింది.

ఎ. వి. రమణారావు



రాత్రి పొద్దు పోయిన దాకా కోటీశ్వరుడి ఇంట భజనలూ అవీ జరిగాయి. అంత దాకా రాఘవయ్య కోటీశ్వరుడి బందీగానే ఉన్నాడు. చివరకు తనకు విముక్తి దొరక గానే అతను లక్ష్మీదేవి నుంచి కూడా విముక్తి పొందగోరి తిన్నగా రాజుగారి కోట లోకి నడిచాడు. పట్టెనామాలూ, కొత్త పట్టు బట్టలూ, మెడ నిండా పూలమాలలూ, నిండైన విగ్రహమూ గల రాఘవయ్యను చూసి, వైకుంతం నుంచి దిగి వచ్చిన విష్ణు మూర్తే అయి ఉంటాడని పహరా వాళ్ళె వరూ అడ్డగించ లేదు.

ఆ మర్నాడే ఎవరో కోటీశ్వరుడు ఆల యంలో పూజ చేయించటానికి ఆర్భాటంగా వచ్చి, రాఘవయ్యను చూశాడు. ఆయనకు రాఘవయ్యను చూడగానే ఏమనిపించిందో మరి, అతనికి నమస్కారం చేసి, పట్టు బట్టలు కట్ట బెట్టాడు. ఆ కోటీశ్వరుడి వెంట వచ్చిన వారందరూ రాఘవయ్య మెడలో పూలమాలలు వేశారు. పూజ అనంతరం పెద్ద సంతర్పణ జరిగింది. రాఘవయ్యకు సుష్టుగా భోజనం పెట్టారు. దేవుడి ప్రసాదం తప్ప షడ్రసోపేతమైన భోజనం ఏనాడూ ఎరగని రాఘవయ్య, లక్ష్మీదేవి అన్నంత పనీ చేస్తున్నదని గ్రహించాడు.

రాఘవయ్య ఎవరి ఆటంకమూ లేకుండా తిన్నగా రాజమందిరం లోకి వెళ్ళాడు. అనేక గదులు దాటగా రాజుగారి శయ్యా గారం వచ్చింది. ఒక మంచం మీద రాణీ, ఇంకొంచెం అవతలి మంచం మీద రాజూ పడుకుని నిద్ర పోతున్నారు. రాఘ వయ్య, రాణీని చెయ్యి పట్టుకుని మంచం మీది నుంచి కిందికి జరజరా ఈడ్చాడు. రాణి కెవ్వున అరిచింది. అరుపుకు రాజు లేచి కూర్చున్నాడు. ఎవడో తన భార్యను నేల మీదికి ఈడ్చెయ్యటం రాజు కంట పడింది. రాజు ఆగ్రహావేశంతో తన దిండు కింది నుంచి కత్తి దూశాడు.

అంతలోనే రాణీగారి మంచం పందిరి నుంచి బారెడు పొడుగు తాచుపాము పక్క మీద పడింది. రాజుగారి కత్తి దాన్ని నరకటానికి పనికి వచ్చింది.

"మా ప్రాణాలు కాపాడటానికి ఈ అర్ధరాత్రి అవతరించిన శ్రీ మహావిష్ణువులాగున్నారు! తమ రెవరు?" అని రాజు భక్తితో రాఘవయ్యను అడిగాడు.

"నా పేరు రాఘవుడు," అన్నాడు రాఘవయ్య. రాజుకు అతడిలో గురి కుదిరింది. రాచనగరులోనే అతని కొక మేడ యిచ్చి, అందులో ఉండి తనను పావనం చెయ్యమని రాజు అతన్ని వేడుకున్నాడు. లక్ష్మీదేవిని ఓడించటానికి తనకు శక్తి చాలదని గ్రహించి రాఘవయ్య సరేనన్నాడు.

రాఘవయ్యకు సిరి ఎత్తుకున్నది. రాజుగారి ఆదరణతో బాటు అతనికి రాజ పరివారంలోని అందరి ఆదరణా లభించింది. రోజూ అతనికి అంతులేని కానుకలు లభించేవి. ఎవరో అతనికి చక్కని, లక్ష్మీదేవిలాటి పిల్ల నిచ్చి పెళ్ళికూడా చేశారు. రాఘవయ్యకు నలుగురు పిల్లలు కూడా కలిగారు.

లక్ష్మీదేవి కోసం రాఘవయ్య ఒక పెద్ద ఇనప్పెట్టె ఏర్పాటు చేశాడు. లక్ష్మీదేవి అందులో మూలుగుతూ ఉండేది. ఇలా పన్నెండేళ్ళు గడిచాయి.






రాజుగారు వేటకు వెళ్ళినప్పుడల్లా రాఘవయ్యను వెంట తీసుకుపోయేవాడు. రాఘవయ్య తన భార్యనూ, పిల్లలనూ పంపేసిన మర్నాడే రాజు వేటకు బయలు దేరుతూ రాఘవయ్యను కూడా తీసుకు పోయాడు. ఆ రోజు వేట ఏ మాత్రమూ సుఖంగా సాగలేదు. మధ్యాహ్న మయేసరికి రాజుగారూ, వేటగాళ్ళూ బాగా అలిసి పోయారు. ఎండవేళ రాజుగారు రాఘవయ్య తొడ మీద తలపెట్టుకుని ఒక చెట్టు నీడన నిద్రపోయాడు. వేటగాళ్ళు దూర దూరంగా చెట్ల కింద చేరారు.

అకస్మాత్తుగా చెట్టు మీది నుంచి ఒక కాకి రాజుగారి మెడ మీద రెట్ట వేసింది. గాఢనిద్రలో ఉండి రాజుగారు నిద్ర లేవ లేదు. రాజుగారి తల కదిలించకుండా ఆ రెట్ట తీసే ఉపాయం తోచక రాఘవయ్య చాలా సేపు తికమక పడ్డాడు. ఇంతలో అతనికి రాజుగారి బొడ్డులో ఉన్న చిన్న బాకు కనిపించింది. రాఘవయ్య ఆ బాకును ఒర నుంచి తీసి, దానితో రాజుగారి మెడ మీద ఉన్న రెట్ట తీసేయబోయాడు. అంతలోనే రాజుగారు కళ్ళు తెరిచి, తన మెడ మీదికి వస్తున్న బాకును చూసి, "ద్రోహీ! ద్రోహీ!" అని కేకలు పెడుతూ లేచి

ఒక లక్ష్మివారం సాయంకాలం రాఘవయ్య భార్య మేడ మీది నుంచి మెట్లు దిగి వస్తూ, "దీపాల్లేవు, ధూపాల్లేవు! అందరూ ఎక్కడ చచ్చార్రా?" అని కేక పెట్టింది.

అదే లక్ష్మీదేవి చెప్పిన గుర్తు!

రాఘవయ్య తన మనస్సులో లక్ష్మీదేవికి దణ్ణం పెట్టుకుని, "అహా! వెళ్ళి వస్తావా, తల్లీ? వెళ్ళు," అనుకుని తన భార్యతో, "నన్నేమీ అడగకు. ఇనప్పెట్టెలో ఉన్న దంతా ఊడ్చేసుకుని, నువ్వూ, నీ పిల్లలూ మీ పుట్టింటికి వెళ్ళిపొండి," అని చెప్పి, ఆ రాత్రే వాళ్ళను పంపేశాడు.

కూర్చున్నాడు. రాజభటులు పరిగెత్తుకుంటూ వచ్చారు.

"నా పంచ చేరి నా ప్రాణాలకే ఎసరు పెట్టిన ఈ ద్రోహిని బంధించండి," అని రాజు తన భటులను ఆజ్ఞాపించాడు.

రాఘవయ్యను పెడరెక్కలు విరిచికట్టి నగరానికి తీసుకుపోయారు.

మర్నాడు విచారణ. రాజుగారు నిండు సభలో రాఘవయ్య మీద రాజద్రోహ నేరం ఆరోపణ చేసి, "ఏం చెప్పుకుంటావు ?" అని అడిగాడు.

"నే నేమీ చెప్పుకోను. మీకు తోచిన శిక్ష విధించండి," అన్నాడు రాఘవయ్య.

"నీకు ఉరిశిక్ష విధిస్తున్నాను. నీ ఆఖరి కోరిక ఏమైనా ఉంటే చెప్పు, తీరుస్తాం," అన్నాడు రాజు.

"నా ఇనప్పెట్టెలో ఒక చందుగాయి పెట్టె ఉన్నది. అందులో నా నిక్షేపం ఉన్నది. దాన్ని ఒక్కసారి కళ్ళ చూడనిచ్చి తరవాత మరణదండన విధించండి," అన్నాడు రాఘవయ్య.

రాజోద్యోగులు వెళ్ళి ఇనప్పెట్టె తెరిచి చూస్తే అంతా ఖాళీగా ఉన్నది. అందులో ఉన్న చందుగాయి పెట్టె తెచ్చి, రాజసభలో తెరిచారు. అందులో ఒక నీరుకావి పంచే, ఒక చిన్న చెంబూ మాత్రమే ఉన్నాయి.

"ఇవా నీ నిక్షేపం?" అని రాజు ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును, మహారాజా. వాటిని నమ్ముకున్నంత కాలమూ నే నే కష్టమూ ఎరగను. ఇంతలో నాకు లక్ష్మీకటాక్షం సంప్రాప్తమయింది. అది శాశ్వతం కాదనీ, ఈ స్థితి ఎప్పటికైనా వస్తుందనీ తెలిసే వాటిని భద్రంగా దాచి ఉంచాను. వాటిని నాకు ఇప్పించినట్టయితే నా మానాన నేను పోతాను," అన్నాడు రాఘవయ్య.

రాజు ఆశ్చర్యపడి రాఘవయ్యను పోనిచ్చాడు.





# విద్రోహం

ఒకప్పుడు అవంతీ పురాన్ని బాలాదిత్యు డనే రాజు పాలించేవాడు. అయనకు వసుధ అనే భార్య ఉండేది. వారిద్దరికీ చాలాకాలం పిల్లలు కలగలేదు. అందుచేత జ్యోతిష్కులు అయనను తిరిగి పెళ్ళాడ మనీ, సంతానం తప్పక కలుగుతుందనీ చెప్పారు. వారి సలహాప్రకారం రాజు ఇందుమతి అనే ఆమెను పెళ్ళాడాడు.

ఇందుమతి చాలా మంచిది, సాత్వికు రాలు. అమె తన భర్త పట్లా, తన సవతి పట్లా ఎంతో భక్తి విశ్వాసాలతో ఉండేది. కాని రాజుగారి పెద్ద భార్యకు ఇందుమతి అంటే మొదటినుంచీ చాలా ఈర్ష్య. ఎందు కంటే అమె వల్ల రాజుగారికి సంతానం కలుగుతుందని జ్యోతిష్కులు చెప్పారు. కాలక్రమాన ఇందుమతి రాజమాత అవు తుంది, తాను మాత్రం అనామకురాలుగా ఉండిపోతుంది.

బాలాదిత్య మహారాజు కూడా ఇందుమతి లోని మంచితనాన్ని చూసి, అమె పట్ల చాలా ప్రేమగా ఉంటూ వచ్చాడు. ఈ కారణం చేత వసుధకు తన సవతి మీద గల ఈర్ష్య రెట్టింపయింది.

కొంతకాలం గడిచాక ఇందుమతి గర్భ వతి అయింది. అమెకు కాన్పు వచ్చే సమ యానికి అమెను ఎలాగైనా నాశనం చెయ్యాలని వసుధ నిశ్చయించుకున్నది. "నీ కేమీ భయంలేదు. నీకు సుఖ ప్రసవ మయేటట్టు నేను చూస్తాను," అని అమె ఇందుమతికి ధైర్యం ఇచ్చింది.

ఒకనాటి సాయంకాలం ఇందుమతికి నొప్పులు ఆరంభమయాయి. పెద్ద రాణి మంత్రసానిని పిలిచి, "చిన్నరాణికి పుట్ట బోయే బిడ్డను మాయంచేసి, అమెకు కప్పలు పుట్టినట్టు నాటక మాడాలి. ఒక బుట్టెడు కప్పలు పట్టుకురా," అని, మంత్రసానికి

సి. కె. సుగుణవతి



పెద్ద లంచం ఇచ్చి పంపింది. మంత్రసాని బుట్టెడు కప్పలను తెచ్చి పురిటిగదికి సమీపంలో ఉంచింది.

పెద్దరాణి పురిటి గదిలో ఒక నిచ్చెన పెట్టించి, చిన్నరాణితో, "నువ్వు కళ్ళకు గంతలు కట్టుకుని ఈ నిచ్చెనను ఆరు సార్లు ఎక్కి దిగావంటే సుఖప్రసవ మవుతుంది," అని చెప్పింది. నిజమే కాబోలు ననుకుని ఇందుమతి కళ్ళకు గంతలు కట్టించుకుని నిచ్చెన ఎక్కి దిగసాగింది.

మూడోసారి ఎక్కి దిగేటప్పటికే ఇందుమతికి పెద్ద నొప్పులు వచ్చాయి. తరువాత ఆమె కవల పిల్లలను కన్నది; ఒక పిల్లవాడూ, పిల్లా పుట్టారు. ఏమి జరుగుతున్నదీ ఇందుమతికి తెలీదు.

పుట్టిన పిల్ల లిద్దరినీ పెద్దరాణి అవతలికి తీసుకుపోయింది. ఆమె ముందుగానే చెప్పి పెట్టినట్టుగా, బుట్టలోని కప్పలను మంత్రసాని పురిటిమంచం మీద కుమ్మరించింది. తరవాత ఆ మంత్రసాని ఇందుమతితో, "మహారాణీ, ఘోరం జరిగింది! తమరు కప్పల్ని కన్నారు!" అని దుఃఖం అభినయిస్తూ చెప్పింది.

పిల్లలను ఎత్తుకుని ఇవతలికి వచ్చిన పెద్దరాణి, మల్లమ్మ అనే ముసలి దాసిని



పిలిచి, "ఈ పిల్లలను తీసుకుపోయి ఏటి ఒడ్డున పూడ్చిపెట్టిరా. మంచి బహుమానం ఇస్తాను. అంతా గుట్టుగా జరగాలి. ఎవరికైనా రహస్యం తెలియనిచ్చావా, నిలువునా చీల్చేస్తాను," అన్నది.

మల్లమ్మ ఆ బిడ్డ లిద్దరినీ తీసుకుని తెల్లవారు ఝామునకు ఏటి ఒడ్డుకు చేరింది. ప్రాణాలతో ఉన్న బిడ్డలను పాతిపెట్టటానికి ఆమెకు చేతులు రాలేదు. ఆ బిడ్డలను ఏటి గట్టునే వదిలేసి, మల్లమ్మ వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది. తాను రావటమూ పోవటమూ ఎవరూ చూడలేదని మల్లమ్మ అనుకున్నది. కాని ఆమెను ఒక కుమ్మరివాళ్ళ



అనుకుని కుమ్మరిమనిషి ఆ బిడ్డలను తీసుకుని ఇంటికి వెళ్ళింది.

చిన్నరాణి కప్పలను కన్న దన్నవార్త గుప్పున లేచింది. ఈ వార్త అందరికన్న ఇందుమతికే ఎక్కువ బాధ కలిగించింది. కాని అలా ఎందుకు జరిగిందో ఆమెకు తెలియదు. రాజుగారు కప్పలను కన్న భార్యను అంతఃపురంలో ఉంచటానికి సిగ్గుపడి, ఆమెకు అరణ్యంలో ఇల్లు కట్టించి, అక్కడే ఉంచాడు.

ఏటి సమీపంలో కుమ్మరిదాని ఇంట ఇందుమతి పిల్లలు గారాబంగా పెరగసాగారు. వాళ్ళిద్దరూ చాలా అందమైన పిల్లలు, తెలివిగలవాళ్ళు. అటువంటి పిల్లలు దొరికినందుకు కుమ్మరిమనిషిని చుట్టుపక్కల వాళ్ళంతా అభినందించారు.

నెలలూ, సంవత్సరాలూ దొర్లిపోయాయి. ఇందుమతి చేత అడవిలో కాపరం పెట్టించి నప్పటి నుంచీ రాజుగారి మనసులో ఏదో వ్యాధి ఏర్పడింది. పిల్లలు కలగకపోగా, ఆయన జీవితాని కేదో అనర్థం చుట్టుకున్నది. రాజుగారి శరీరమూ, మనస్సూ క్షీణించిపోతూ ఉండటం గమనించి, మంత్రి, పురోహితుడు మొదలైనవాళ్ళు, "మహారాజా, గ్రహలగతులు బాగాలేవు. మీరు

మనిషి చూసింది. ఆ మనిషి మట్టి కోసం ఏటిగట్టుకు వచ్చింది; మల్లమ్మను చూసి గుర్తించింది; మల్లమ్మ దేన్నోతెచ్చి గట్టున పెట్టి వెళ్ళిపోవటం కూడా గమనించింది.

కుమ్మరిమనిషి దగ్గిరికి వచ్చి చూస్తే, పిల్లలు! అప్పుడే పుట్టిన పిల్లలు! చిన్నరాణిగారు కనేరోజులని కుమ్మరిమనిషికి తెలుసు. కాని చిన్నరాణి కన్న పిల్లల్ని మల్లమ్మ ఏ ఉద్దేశంతో ఏటిగట్టున వదిలిపోయి ఉంటుంది?

ఆ రహస్యం తరవాత మెల్లిగా బయటపడుతుందనీ, రాజుగారి బిడ్డలను కాపాడినందుకు తనకు గొప్ప కీర్తి వస్తుందనీ

గ్రహపూజ చేసి, బ్రాహ్మణులకు బంగారు కప్పలు దానం చేసి, ప్రజలకు సంతర్పణ చేసినట్టయితే అన్ని దోషాలూ పోతాయి," అని సలహా ఇచ్చారు. రాజు అలాగే చేయ సంకల్పించాడు.

ఫలాని రోజున సంతర్పణ జరుగుతుందనీ, అందరూ రావాలనీ ఊరూరా చాటింపులు జరిగాయి. ఈ చాటింపు విని కుమ్మరి మనిషిని పిల్లలు, "అవ్వా, రాజుగారు ఎందుకు సంతర్పణ చేస్తున్నారు?" అని అడిగారు.

"రాజుగారికి ఒక భార్య ఉండేది. ఆ భార్యకు పిల్లలు పుట్టకపోతే ఇంకో భార్యను చేసుకున్నాడు. ఆ రెండో భార్య గర్భిణి అయి, ఒకనాటి రాత్రి చక్కని బిడ్డలను ఇద్దరిని కన్నది. కాని ఎవరో గిట్టని వాళ్ళు ఆ బిడ్డలను ఏటి ఒడ్డున పారేయించి, చిన్నరాణికి కప్పలు పుట్టాయని చెప్పారు. రాజు వెర్రివాడై ఆ మాట నమ్మి, చిన్నరాణిని అడవికి పంపించి, ఆ పాపంతో తీసుకుంటున్నాడు. ఆ పాపం పోయేటందుకే ఇప్పుడు బంగారు కప్పలను బ్రాహ్మణులకు దానం చేసి, ప్రజలందరికీ సంతర్పణ చేస్తున్నాడు," అని కుమ్మరి మనిషి బిడ్డలకు చెప్పింది.



"రాజుగారి బిడ్డలు ఏమయారవ్వా?" అని వాళ్ళు అడిగారు.

"ఎక్కడో నిక్షేపంగా పెరుగుతున్నారు," అన్నది కుమ్మరిమనిషి.

"సంతర్పణకు మనం కూడా పోదామా, అవ్వా?" అని వాళ్ళు మళ్ళీ అడిగారు. కుమ్మరిమనిషి సరేనన్నది. కాని తీరా ఆ రోజున కుమ్మరిమనిషి తాను వెళ్ళటం మానుకుని, పిల్లలను మాత్రమే వెళ్ళమన్నది. వాళ్ళు భోజనాల దగ్గిర ఏం చెయ్యాలో చక్కగా బోధించి పంపింది. పిల్లలిద్దరూ తాము ఆడుకునే బొమ్మలను వెంట తీసుకుని సంతర్పణకు వెళ్ళారు.

వాళ్ళు భోజనాల దగ్గిర తమ బొమ్మలను పక్కనే కూర్చోబెట్టుకుని కూర్చుని, వడ్డించే వాళ్ళచేత ఆ బొమ్మలకు కూడా విస్తళ్ళు వేయించారు, వడ్డన కూడా చేయించారు.

వడ్డనవాళ్ళు బొమ్మలకు వడ్డన చెయ్యక పోతే, తాము భోజనం చెయ్యమని వాళ్ళను బెదిరించారు.

ఈ విషయం రాజుగారి దాకా వెళ్ళింది. ఆయన స్వయంగా వచ్చి, పిల్లలిద్దరినీ చూసి ముచ్చటపడి, "వెర్రిపిల్లల్లారా, బొమ్మలు భోజనం చేస్తాయా? ఎందు కిలా పేచీ పెడుతున్నారు?" అని అడిగాడు.

వెంటనే పిల్లలు, "మనిషి కెక్కడన్నా కప్పలు పుడతాయా? రాజుగారు చిన్న రాణిగారిని అడివి కెందుకు పంపారు?" అని అడిగారు.

రాజు నెత్తిన పిడుగు పడ్డట్టయింది. ఆయన పిల్లలను లేవదీసి అవతలికి తీసుకు పోయి, "చిన్న రాణికి కప్పలు పుట్టటం మాట మీ కెవరు చెప్పారు?" అని అడిగాడు.

"మా అవ్వ చెప్పింది. అవ్వకు అంతా తెలుసు," అన్నారు పిల్లలు.

రాజు కుమ్మరి మనిషిని పిలిపించి అడిగాడు. ఆమె తనకు తెలిసిన దంతా చెప్పి, మిగిలిన విషయాలను మల్లమ్మ నడగమన్నది. మల్లమ్మ బెదిరిపోయి నిజం చెప్పేసింది. ఆ పిల్లలిద్దరూ తన పిల్లలేనని రాజు గ్రహించాడు. ఆయన అరణ్యంలో ఉంటున్న ఇందుమతిని రప్పించి, తన పెద్ద రాణికి అక్కడ నివాసం ఏర్పాటు చేశాడు. ఇన్ని ఏళ్ళపాటు తన పిల్లలను పోషించటమే గాక, వారు తనకు దక్కేటందుకు యుక్తిపన్నిన కుమ్మరిమనిషికి గొప్ప ఈనాము ఇచ్చాడు.

తరవాత ఆయన, మనోవ్యాధులన్నీ తీరి, తన భార్యతోనూ, పిల్లలతోనూ ఎంతో కాలం సుఖంగా ఉన్నాడు.





# ఆనవాలు

ఒక ఊళ్ళో శివదాసు అనే వ్యవసాయదారు ఉండేవాడు. ఆయనా, ఆయన భార్యా నడివయసులో ప్రవేశిస్తుండగా వారికొక కొడుకు కలిగాడు. వాడికి కుమారదాసు అని పేరు పెట్టుకున్నారు.

అతిగారాబంగా పెరిగిన కుమారదాసు చాలా మకురుగా తయారయాడు. అయిదేళ్ళు నిండగానే వాడికి అక్షరాభ్యాసం చేశారు. కాని వాడు బడికి పోనని హఠం పట్టాడు. వాడి ఇష్టం సాగనిస్తే చదువు సంధ్యలు లేక ఎందునా కాకుండా పోతాడని, తల్లిదండ్రులు మంచిగా చెప్పి చూశారు. లాభంలేక పోయింది. ప్రాణం విసిగి తండ్రి వాణ్ణి కొట్టాడు. తల్లి తిట్టింది. ఆ రోజే కుమారదాసు ఎవరికీ చెప్పకుండా ఎటో వెళ్ళిపోయాడు. శివదాసు ఎంతో శ్రమపడి కొడుకు కోసం వెతికాడు, కాని వాడి జాడ తెలియరాలేదు.

ఏళ్ళు గడిచిపోయాయి. శివదాసుకు మళ్ళీ సంతానం కలగలేదు. తన కొడుకు తప్పక ఎప్పటికైనా తిరిగి వస్తాడని ఆయనకు బలమైన నమ్మకం. ఆయన వృద్ధాప్యంలోకి అడుగుపెట్టాడు. తనకు శరీరపాటవం తగ్గిపోతున్న దశలో ఆయన రాముడనే ఒక సేవకుణ్ణి తన ఇంట పెట్టుకున్నాడు.

రాముడు శివదాసుకు అన్నివిధాలా తోడ్పడుతూ, చేతికి అంది వచ్చిన కొడుకులాగే మసలుకునేవాడు. వాడు విశ్వాసపాత్రుడేగాక, మంచి తెలివితేటలూ, వివేకమూ గలవాడు. అందుచేత శివదాసు రాముడితో తమ కుటుంబ రహస్యం చెప్పేశాడు.

రెండు మూడు తరాలుగా శివదాసు ఇంట ఒక నిధి ఉన్నది. గాలి కబురుగా ఈ వార్త చాలామందికి తెలును. కాని ఆ నిధి

జి. సూర్యకుమారి





"ఓహో, అలాగా? చాలా సంతోషం! మీ ఇల్లు చూసుకుందువుగాని, నావెంటరా," అంటూ రాముడు ఆ వచ్చిన మనిషిని తన వెంట ఒక్కొక్క గదికీ తీసుకు వెళ్ళాడు. రెండు గదులలో ఏమీలేదు. ఒక గదిలో వంకెన ఒక చొక్కా వేళ్ళాడుతున్నది. ఇంకో గదిలో మూడు పెద్దబానలు ఉన్నాయి. ఒక దానినిండా బియ్యమూ, రెండోదాని నిండా ఎండు మిరపకాయలూ, మూడో దానిలో తవుడూ ఉన్నాయి.

ఈ గదులన్నీ చూసినాక రాముడు ఆ వచ్చిన వాడితో, "నువు కుమారదాసువు కావు. వచ్చిన దారినే వెళ్ళు. లేకపోతే నిన్ను గ్రామాధికారికి అప్పగించేస్తాను," అని చెప్పాడు.

వచ్చినవాడు రాముడి కేసి బెదురుతూ చూసి, మారు మాటాడకుండా వెళ్ళి పోయాడు. వాడు నిధి మీది ఆశతో వచ్చిన వాడు. ఇలాగే మరో ఇద్దరు ముగ్గురు కూడా, "నేను కుమారదాసును," అని చెప్పు కుంటూ వచ్చారు. వారిలో పాతికేళ్ళు నిండనివాళ్ళు కూడా ఉన్నారు. వాళ్ళను రాముడు వెంటనే పంపేశాడు; ముప్పై దాటినట్టు కనబడిన వాళ్ళను మాత్రమే గదులన్నీ తిప్పి పంపేశాడు.

ఎక్కడ ఉన్నదీ శివదాసుకు తప్ప మరెవరికీ తెలీదు. దాని రహస్యాన్ని శివదాసు ద్వారా రాముడు తెలుసుకున్నాడు.

శివదాసూ, ఆయన భార్యా బాగా ముసలి వాళ్ళయిపోయారు. వాళ్ళకు ఏ లోటూ రాకుండా రాముడు కాపాడుతున్నాడు. తన కొడుకు తిరిగి వస్తాడన్న నమ్మకం శివదాసులో ఇంకా బలంగానే ఉన్నది. ఆ మాట ఆయన ఇరుగుపొరుగు అందరితోనూ అంటూనే ఉండేవాడు.

ఒకరోజు ముప్పై ఏళ్ళు దాటిన వాడెవడో వచ్చి, "నేనే కుమారదాసును," అన్నాడు రాముడితో.



కొద్దిరోజులు గడిచాయి. ఒకరోజు రాముడు తమ ఇంటి ముందు ఒక మగవాడూ, చిన్న పిల్లవాణ్ణి ఎత్తుకుని ఒక ఆడదీ నిలబడి ఉండటం గమనించి బయటికి వచ్చాడు. ఆడది దిక్కులు చూస్తున్నది, కాని మగవాడు మాత్రం ఇంటిని పరీక్షగా చూస్తున్నాడు. ఆ మనిషి వయసు దాదాపు ముప్పై అయిదేళ్ళున్నట్టు కనబడింది.

రాముడు కనిపించగానే ఆ మగవాడు, "ఈ ఇంట్లో ఇప్పుడు శివదాసుగారుండటం లేదా?" అని అడిగాడు.

"ఇది శివదాసుగారిల్లే. నీకేం కావాలి?" అని రాముడడిగాడు.

"ఆయన కులాసాగా తిరుగుతున్నాడా? ఆయననూ, ఆయన భార్యనూ చూసి పోదామని వచ్చాం. చూడటానికి వీలవుతుందా?" అని ఆ మనిషి అడిగాడు.

"ఆ సంగతి చెపుతాను, నువ్వెవరు?" అని రాముడడిగాడు.

"నే నెవరైతేనేంలే? గాలికి తిరిగేవాణ్ణి," అన్నాడు ఆ మనిషి.

"శివదాసుగారినీ, ఆయన భార్యనూ చూపిస్తాను, నా వెంటరా. ఆ ఆడమనిషినీ, పిల్లవాణ్ణీ ఇలా వసారాలో కూర్చోమను,"



అంటూ రాముడు ఆ మగవాణ్ణి వెంట తీసుకుని ఒక్కొక్క గదీ తిప్పాడు.

ఖాళీ గదులు చూసి ఆ మనిషి ఏదో గొణుక్కున్నాడు. వంకెనున్న చొక్కాను చూడగానే ఆగి, దాన్ని వంకె నుంచి తీసి, అటూ ఇటూ తిప్పి చూసి, తనలో తాను నవ్వుకున్నాడు. బానలున్న గదిలోకి రాగానే బియ్యం ఉన్న బాన దగ్గిర ఆగిపోయి, ఏదో ఆలోచిస్తున్నట్టు కనబడ్డాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అని రాముడడిగాడు.

"ఏదో జ్ఞాపకం వచ్చింది. అది నీకు చెప్పే సంగతికాదు," అన్నాడు ఆ మనిషి.

తరవాత రాముడు ఆ మనిషిని శివదాసూ, ఆయన భార్యా ఉండే గదికి తీసుకుపోయి, "మీ అబ్బాయి వచ్చాడు," అని చెప్పాడు. ముసలివాళ్ళు మంచం మీద కూర్చుని ఉన్నారు. కొత్తవాడు వాళ్ళకేసి కొంచెంసేపు వింతగా చూసి, "అమ్మా!" అని ఒక్క కేకపెట్టి, వెళ్ళి శివదాసు భార్యను కౌగలించుకున్నాడు.

శివదాసుకు మాత్రం ఇంకా అనుమానం తీరలేదు.

"నువు కుమారదాసువని మాకు ఆనవాలేమిటి, నాయనా? ఎందరో వచ్చారు. ఇంట్లో ఎక్కడో నిధి ఉన్నదని విని ఆశపడి, ఎక్కడెక్కడి వాళ్ళూ, 'నా పేరు కుమారదాసు', అంటూ వస్తున్నారు. కాని రాముడు ఇంతకాలమూ మోసపోలేదు," అన్నాడు శివదాసు.

"నిధి కోసమైతే నే నెప్పుడో రాకపోయానా, నాన్నా? బియ్యం బాన అడుగున బిందె ఉన్న సంగతి నాకు తెలీదా? నేను మిమ్మల్నిద్దరినీ చూద్దామనే నా భార్యనూ, కొడుకునూ వెంట పెట్టుకుని వచ్చాను. నన్ను మీరు ఏనాడో మరిచిపోయి ఉంటారనుకున్నాను. కాని నా చిన్ననాటి చొక్కా ఉత్తరపు గదిలో వంకెన ఇంకా వేళ్ళాడుతూనే ఉన్నది. నన్ను మీరు మరవనందుకు చాలా సంతోషమయింది," అన్నాడు కుమారదాసు.

శివదాసు అనుమానం తీరిపోయింది. ఆయన రాముణ్ణి కుమారదాసుకు చూపిస్తూ, "ఇన్నేళ్ళుగా వీడే నీ స్థానంలో ఉన్నాడు. వీడు నీకు తమ్ముడే అనుకో. ఇద్దరూ సఖ్యంగా ఉండండి," అన్నాడు.

కుమారదాసు తన భార్యా బిడ్డలతో తల్లిదండ్రుల వద్దనే ఉండిపోయాడు. ముసలిదంపతులు గారాబం చెయ్యటానికి మనవడు ఒకడు దొరకటంచేత మరింత ఆనందంపొందారు.





# గోహా - గొర్రె

గోహా మంచి తిండిపుష్టిగలవాడు. అతనికి తన భార్య చేసే వంట ఆనేదికాదు. అందు చేత అతను ఎక్కడెక్కడ విందులు జరుగుతున్నదీ విచారించి, అక్కడి కెల్లా వెళ్ళి, ఏ వారానికో, పదిరోజులకో ఇంటికి తిరిగి వస్తూండే వాడు.

ఒక రోజు గోహా ఇంటికి తిరిగి వచ్చేసరికి అతని భార్య పెద్దగా ఏడ్చి, "దూరపు బంధువల్లే నువు ఎప్పుడో ఒకసారి ఇంటికి వస్తే నాకు ఒంటరిగా రోజుల తరబడి ఎట్లా పొద్దు పోతుందనుకున్నావు? నువు ఉండనే ఉండవు, నీకు బదులుగా ఒక కుక్కో, పిల్లో ఇంటో ఉంటే దానితో నాకు కొంత కాలాక్షేపం అవుతుంది," అన్నది.

గోహా సరేనని ఒక బక్కచిక్కిన గొర్రెను చవకగా కొనితెచ్చి, భార్యకిచ్చి, "దీని పోషణ నువే చూడు. నీకు కాలయాపన బాగా అవుతుంది," అన్నాడు.

ఆ బక్కగొర్రె కూడా గోహాలాటిదే. అది గోహా ఇంటి పెరడులో ఉన్న నాలుగు మొక్కలూ తినేసి, ఇరుగు పొరుగువాళ్ళ పెరళ్ళ మీద పడింది.

మళ్ళీ గోహా ఇంటికి వచ్చినప్పుడు గోహాతో అతని భార్య, "నాకు తోడుగా ఉండటానికి మంచి గొర్రెనే తెచ్చావు! దీని మూలంగా చుట్టుపక్కల వాళ్ళు శత్రువులయారు. అది అందరి పెరళ్ళూ ఖాళీ చేసేస్తున్నది. అందరూ చేరి మన కొంపకి చిచ్చుపెట్టే ట్టున్నారు. దీన్ని తక్షణం బజారుకు తీసుకుపోయి ఏ కసాయివాడికైనా కాను కగా ఇయ్యి," అన్నది.

గోహాకు ఏం చెయ్యటానికీ పాలుపోలేదు. అంతలో అతనికి తన మిత్రుడొకడు జ్ఞాపకం వచ్చాడు. అతను గోరీల ఆవరణలో ఉంటాడు. శవాలను పాతిపెట్టే వాళ్ళు అతనికి డబ్బిచ్చుకోవాలి. గోహా తన గొర్రెను

ఆర్. వెంకటాచారి

తీసుకుని గోరీల దగ్గిరికి వెళ్ళాడు. ఆ స్థలంలో పచ్చనిగడ్డి ఏపుగా పెరిగి ఉన్నది.

గోహ తన మిత్రుణ్ణి కలుసుకుని, "నేను కూడా అల్లా పిలుపురాగానే పోవలిసిన వాణ్ణే గద. నన్ను నువు పాతెయ్యటానికి తీసుకునే దేదో ముందే ఇచ్చేస్తున్నాను. ఈ గొర్రెను నువు పుచ్చేసుకో," అన్నాడు.

మిత్రుడు సరే నన్నాడు.

రెండు మూడు నెలలు గడిచాక గోహ గోరీల కేసి వెళ్ళటం తటస్థించింది. అక్కడ గొర్రె కనబడింది. ఇప్పుడా గొర్రె బాగా బలిసి కొవ్వుపట్టి ఉన్నది. దాని తోక బాగా లావెక్కింది.

అంత మంచి గొర్రెను ఊరికే ఇచ్చేసినందుకు గోహకు దిగులు పుట్టుకొచ్చింది. తాను ఎప్పటికి చచ్చేదీ తెలీదు. ఇంత త్వరలో చావాలనే ఉద్దేశం కూడా అతనికి లేదు. అందుచేత గోహ తీవ్రంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఒక రాత్రి గోహ తన మిత్రుణ్ణి చూడబోయి, "అన్నా, ప్రయాణం కా!" అన్నాడు.

"ఎక్కడికి? ఎందుకు?" అన్నాడు గోహ మిత్రుడు ఆశ్చర్యంగా.

"నేను దేశం విడిచి పారిపోతున్నాను. ఏం జరిగిందంటే మా పొరుగింటి బిడ్డకు జబ్బు చేస్తే నేను చిన్నమెత్తు రసం వేశాను. ఆ బిడ్డ కాస్తా చచ్చింది. నేనిక్కడ ఉండటం అపాయకరం. అందుచేత నువు కూడా రా," అన్నాడు గోహ.

"నువు దేశం విడిచిపోతే నీ వెంట నేను కూడా దేనికి?" అన్నాడు మిత్రుడు.

"నన్ను నువు పాతెయ్యాలి గద. నీకు ముందుగానే గొర్రె నిచ్చుకుంటినే!" అన్నాడు గోహ.

మిత్రుడికి మండెత్తుకొచ్చి. "నీ వెధవ గొర్రెను నువే పట్టుకెళ్ళు. నేను మాత్రం ఎక్కడికీ రాను!" అన్నాడు. గోహ నిక్షేపంగా గొర్రెను తోలుకుని ఇంటికి వెళ్ళాడు.





# ముక్కకాటుకు చెప్పుదెబ్బ

ఒక గ్రామంలో కామేశం అనే యువకుడుండేవాడు. అతనికి తల్లీ తండ్రీ పోయారు. అతను ఎంతో శ్రమపడి తన చెల్లెలు సావిత్రిని పెంచి పెద్దచేసి, యుక్తవయస్సు రాగానే ఆమెకు తగిన సంబంధం చూసి పెళ్ళి చేసి, ఆమెను అత్తవారింటికి పంపేశాడు. ఈ విధంగా కామేశం తన బాధ్యతలన్నీ తీరిపోయాక తాను కూడా పెళ్ళాడి, ఒక ఇంటి వాడయాడు.

కామేశం భార్య పేరు శాంతమ్మ. అయితే ఆమెలో శాంతం అన్నది ఏ కోశానా లేదు. ఆమె నోరు కూడా అంత మంచిది కాదు. ఇందువల్ల కామేశానికి జీవితంలో సుఖం లేకుండా పోయింది. తన భార్య మనస్తత్వం తెలుసుకున్నాక, అతను పండగలకూ, పబ్బాలకూ తన చెల్లెల్ని తీసుకురావటం కూడా మానేసి, తన భార్యకు తెలియకుండా అప్పుడప్పుడూ తాను ముట్టచెప్పదలుచుకున్నది చాటుగా తన చెల్లెలికి పంపుతూ ఉండేవాడు.

తన అన్నకు తన మీద ప్రేమ ఉన్నదని సావిత్రికి తెలును గాని, తాను అడపాదడపా పుట్టింటికి వెళ్ళి నాలుగు రోజులుండలేక పోయినందుకు ఆమె బాధపడుతూనే ఉండేది.

కాలం దొర్లింది. సావిత్రి ముగ్గురు పిల్లల తల్లి అయింది. కామేశానికి కూడా పిల్లలు పుట్టుకొచ్చారు. ఇంతకాలమైనా చెల్లెల్ని తీసుకొచ్చి రెండు రోజులపాటు ఉంచుకోలేకపోయానన్న విచారం కామేశం మనసులో ఉండనే ఉన్నది. కాని శాంతమ్మ ఉద్దేశం మటుకు తన భర్త పైన సర్వహక్కులూ తనకే ఉండాలనీ, మరెవరికీ ఉండరాదనీనూ.

ఇలా ఉండగా ఒకనాడు సావిత్రి నుంచి కామేశానికి ఒక ఉత్తరం వచ్చింది. ఆమె

ఏ. వాణి



భర్త దూరప్రాంతానికి వెళ్ళి ఉండగా వాళ్ళ ఇల్లు కాలిపోయిందిట. తనకూ, పిల్లలకూ నిలవ నీడ కూడా లేదనీ, తాను పిల్లలతో సహా పుట్టింటికి వస్తున్నాననీ సావిత్రి రాసింది.

సావిత్రి తన యింట ఒక్క ఘడియ కూడా ఉండలేదనీ, అంతకన్న తానే వాళ్ళ ఊరు వెళ్ళి, సావిత్రికి ఇల్లు మళ్ళీ ఏర్పాటు చేసి రావటం మంచిదనీ అనుకుని, కామేశం డబ్బు పుట్టించుకు రావటానికి ఊళ్ళోకి వెళ్ళాడు.

అతను అలా బయటికి వెళ్ళిన కాస్సేపటికే సావిత్రి తన ముగ్గురు పిల్లలతోనూ వచ్చి చేరింది. ఆమెను చూడగానే శాంతమ్మ కొయ్యబారిపోయింది.

సావిత్రి శాంతమ్మతో తమ ఇల్లు నిలువునా కాలిపోవటమూ, తన భర్త ఊళ్ళో లేకపోవటమూ చెప్పి, "పిల్లలు తిండికి అల్లాడుతున్నారు. వాళ్ళకు కాస్త అన్నాలు పెడుదూ!" అన్నది.

తమ యింటి మీదపడి తినటానికి ఆడబిడ్డ వచ్చిందని లోపల్లోపల దహించుకుపోతున్న శాంతమ్మ, "ఏం చెప్పమంటావు, వదినా? నాకు చెప్పటానికి నోరు రావటం లేదు. అవేవో అడవి ఎలకలుట! గుంపులు గుంపులుగా వచ్చిపడి నానాగత్తరా చేస్తున్నాయి. అవి పొయ్యి న్నది ఉంచటం లేదంటే నమ్ము. వంటా, వార్పూ, తిండీ, తిప్పలూ లేకుండా నానా అగచాట్లూపడి పోతున్నాం," అని పెద్ద చెంబూ, గ్లాసూ తెచ్చి పిల్లల్ని నీళ్ళు తాగమన్నది.

సావిత్రికి అంతా అర్థమయింది. తన అన్న తనను ఎన్నడూ ఎందుకు పిలవలేదో ఆమె గ్రహించుకున్నది. ఆమె వెంటనే వీధిలోకి వెళ్ళి, దారే పోయే బండిని మాట్లాడి, పిల్లల్ని అందులో ఎక్కించి, తానుకూడా ఎక్కి తమ ఊరికి తిరుగు ప్రయాణం కట్టింది.



ఎక్కడో డబ్బు పుట్టించి ఇంటికి తిరిగి వస్తున్న కామేశం, తమ ఊరికి తిరిగి పోతున్న సావిత్రిని దారిలో కలుసుకుని, జరిగినదంతా తెలుసుకున్నాడు. అతను ఆమెకు తన దగ్గిర ఉన్న పైకం ఇచ్చేసి, "నేను రెండు రోజుల్లో వచ్చి అన్ని ఏర్పాట్లూ చేస్తాను. ఈలోపుగా ఈ డబ్బుతో కాలక్షేపం చెయ్యి," అని ఇంటికి వచ్చేశాడు.

శాంతమ్మ అతనితో సావిత్రి వచ్చిన సంగతి మాటవరసగా కూడా అనలేదు.

మర్నాడు అతను ఇంట్లో లేని సమయంలో శాంతమ్మకు ఆమె పుట్టింటి నుంచి ఒక ఉత్తరం వచ్చింది. ఆమె కన్నవారిల్లు తగలబడి పోయిందిట. దేవుడిదయ వల్ల ఇంట్లోవాళ్ళు ప్రాణాలతో బయటపడ్డారుట. ఈ ఉత్తరం చదివి శాంతమ్మ పెద్ద పెట్టున శోకాలు పెట్టనారంభించింది.

అంతలోనే కామేశం ఇంటికి వచ్చి, భార్యను చూసి, "ఏం జరిగింది? ఎందుకా శోకాలు?" అని అడిగాడు.

శాంతమ్మ అతనికి ఉత్తరం చూపించి, "ఇంకా కూచునే ఉన్నారా? మా వాళ్ళు పాపం ఏం చిక్కుల్లో ఉన్నారో. బండి మాట్లాడండి. వెంటనే మనమంతా బయలు దేరి వెళ్ళి ఆదుకోవాలి," అన్నది.



"అసలే ఇల్లుపోయి, వాళ్ళు చెట్టు కింద అఘోరిస్తుంటే మనమంతా పోయి వాళ్ళ మీద పడటం దేనికి? వాళ్ళకు మనం ఏ విధంగా సహాయం చెయ్యగలమో చెప్పు, చేసివస్తాను," అన్నాడు కామేశం.

శాంతమ్మ విచారమంతా దిగిపోయింది. ఆమె తమ ఇంటో ఉన్న చెంబూ, తప్పేలా వగైరాలన్నీ గోతాలలో వేసి, పాత్రసామగ్రీ, పప్పులూ, ఉప్పూ, బియ్యమూ, చింతపండూ దగ్గిరనుంచీ తన పుట్టింటికి రవాణాచేసింది.

కామేశం, భార్య యిచ్చిన సరుకులన్నీ బండినిండా వేసుకుని, తాను కూడా ఎక్కి బయలుదేరాడు.

అయితే అతను అత్తవారూరు పోలేదు, తన చెల్లెలుండే ఊరు వెళ్ళాడు. అతను నాలుగు రోజులపాటు అక్కడే ఉండి, చెల్లెలికి ఇల్లు మళ్ళీ కట్టించి, తన భార్య పంపిన వస్తువులతో వాళ్ళకు మళ్ళీ కాపరం ఏర్పాటు చేశాడు. ఈలోగా సావిత్రి భర్త కూడా తిరిగి వచ్చి, తన బావమరిది చేసిన సహాయానికి కృతజ్ఞత చెప్పుకున్నాడు.

శాంతమ్మ ఆ రోజూ, మర్నాడూ భర్త కోసం ఎదురుచూసి, అతను రాకపోయే సరికి, తానే పుట్టింటికి బయలుదేరి వెళ్ళింది. తన పుట్టింటి వాళ్ళ ఇల్లు కాలిపోలేదు. వాళ్ళు చెట్టుకింద కాపరం చెయ్యటం లేదు. తన భర్త అక్కడికి రాలేదు.

"ఇల్లు కాలిపోయిందని ఎవరే నీకు చెప్పింది? కలగన్నావా ఏం?" అని శాంతమ్మను తల్లీ, తండ్రీ కోప్పడ్డారు. వాళ్ళు నాలుగు రోజులుండమని బలవంతం చేస్తున్నా వినకుండా శాంతమ్మ పిల్లలను వేసుకుని ఇంటికి తిరిగొచ్చింది. కామేశం అప్పటికి ఇంటికి వచ్చి ఉన్నాడు.

"మీ రెక్కడికి వెళ్ళారు? మీరు తీసుకు పోయిన వస్తువులన్నీ ఏం చేశారు?" అని శాంతమ్మ భర్త నడిగింది.

"ఏం చెప్పమంటావు? మీ వాళ్ళ ఊరు వెళ్ళే దారిలో వేలకు వేలు కాకులు వచ్చి పడి నే నెక్కిన బండిని ఎగర గొట్టేసుకు పోయాయి. ప్రాణాలు దక్కించుకుని ఇల్లు చేరుకున్నాను," అన్నాడు కామేశం.

"కాకు లేమిటి? బండిని ఎగర గొట్టేసుకు పోవట మేమిటి? మీ కేమన్నా మతి పోయిందా ఏం?" అన్నది శాంతమ్మ.

"అంతా కలికాలం! ఆ మధ్య ఎలుక లొచ్చి మన ఊరి మీద పడి వంట కూడా చేసుకోనిచ్చాయి కావు, చూడూ! అలాగే!" అన్నాడు కామేశం. భర్త ఆడిన నాటకం ఆమెకు అర్థమయింది. అటు తరవాత ఆమె కాస్త బుద్ధిగా మసులుకుంటూ వచ్చింది.





# చూశాను! చూశాను!

ఒక ఊళ్ళో ఒక నాస్తికు డుండేవాడు. దేవుడు లేడనీ, దైవభక్తి గల వాళ్ళందరూ మోసగాళ్ళనీ ఆయన నమ్మకం. ఆయన భార్యా, ఉద్దీపు డనే కొడుకూ కూడా ఆయన లాగే నాస్తికులు.

ఒకసారి నాస్తికుడి చంటిబిడ్డకు జబ్బు చేసింది. మందులూ, మాకులూ ఇచ్చారు గాని పని చేసినట్టు లేదు. నాస్తికుడి పొరుగున ఉండే సాంబుడనే శివభక్తుడు శివాలయం నుంచి ఇంత విభూతి తెచ్చి చంటి బిడ్డకు రాచి, "భయపడకండి. జబ్బు నిమ్మళిస్తుంది," అన్నాడు. అతను అన్నట్టుగానే మర్నాటికి బిడ్డ జబ్బు నయమయింది.

"విభూతి మహత్తు వల్ల జబ్బు నయమయిందని నేను నమ్మను. అదివరకిచ్చిన మందులే పని చేశాయి," అన్నాడు నాస్తికుడు సాంబుడితో.

"ఏదైతేనేం లెండి? జబ్బు నయం కావటమే మనకు కావలిసింది," అన్నాడు సాంబుడు.

నాస్తికుడి కొడుకైన ఉద్దీపుడికి మాత్రం ఈ సంఘటనతో దేవుడి యందు నమ్మకం కుదిరింది. వాడికూ్కడా సాంబుడిలాగే ఉదయానే వెళ్ళి, స్నానం చేసి, గుడిలో శివుడికి మొక్కి, ఇంత విభూతి రాచుకుని రావాలనున్నది. కాని అలా చేస్తే తండ్రి కొడతాడని భయం.

అందుచేత వాడు సాంబుణ్ణి సలహా అడిగాడు.

"భక్తినిష్ఠ మనస్సులో ఉంటే చాలు. విభూతి పూసుకోవటం ముఖ్యం కాదు. నిష్ఠ అంటే ఏమిటంటే ఒక నియమం. భస్మం ధరించిన ఒక భక్తుడి ముఖం చూస్తే గాని భోజనం చెయ్యనని ఒక నియమం పెట్టుకుని, దాన్ని అతిక్రమించ కుండా

-- వి. సుదర్శనం

నడుచుకుంటే అదే నిష్ఠ," అని సాంబుడు ఉద్దీపుడికి సలహా ఇచ్చాడు.

అది మొదలు ఉద్దీపుడు ప్రతి ఉదయమూ ఆలయం నుంచి విభూతి రేఖలతో తిరిగి వచ్చే సాంబుడి ముఖం చూసి గాని పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టేవాడు కాడు. సాంబుడు పొరిగింటివాడే గనక ఉద్దీపుడి నిష్ఠ చక్కగా సాగింది.

కొన్నాళ్ళయాక ఒకరోజు సాయంకాలం సాంబుడు ఉద్దీపుడికి తటస్థపడి, "నిష్ఠ ఏమైనా అవలంబించావా?" అని అడిగాడు.

"అవలంబించానండీ. మీరు చెప్పినట్టే ఒక భక్తుడి ముఖం చూసి గాని ఏమీ తినటం లేదు. నిష్ఠ అవిఘ్నంగా సాగుతున్నది," అన్నాడు ఉద్దీపుడు.

"మంచిది. నీకు మేలు కలుగుతుంది. అలా శివాలయానికి పోదాం పద," అన్నాడు సాంబుడు.

ఇద్దరూ శివాలయం దాకా వెళ్ళారు గాని, ఉద్దీపుడు ఆలయంలోకి రాననీ, శివుడికి మొక్కటం తనకు చేతగాదనీ చెప్పి, సాంబుడు తిరిగి వచ్చిన దాకా ఆలయం వెనక ఉన్న చెట్ల కింద నిలబడ్డాడు. వాడు చెట్టుమాను మొదట్లో పరధ్యానంగా కాలి బొటనవేలితో మట్టి కెలుకుతుంటే ఏదో గట్టిగా తగిలింది. అదేమైవుంటుందా అని



ఉద్దీపుడు తీసి చూస్తే మకిలపట్టి ఉన్న బంగారు కాసు.

సాంబుడు ఆలయం నుంచి బయటికి రాగానే వాడా కాసును అతనికి చూపించి, తన కది చెట్టు మొదల్లో దొరికిందని తెలిపాడు.

"చూశావా, నీ నిష్ఠ అప్పుడే ఫలిస్తున్నది!" అన్నాడు సాంబుడు. అతనా కాసును శ్రద్ధగా పరీక్షిస్తే అది చాలాకాలం నాటిదని తెలిసింది. అది దొరికిన చోట పెద్ద నిధే ఉండవచ్చు నని అతనికి తోచి, ఆ చెట్టు గుర్తుంచుకున్నాడు.

మర్నాడు సాంబుడు మరింత చీకటి తోనే బయలు దేరి ఆ చెట్టు కింద చాలా సేపు తవ్వగా కొంత లోతున రెండు బిందెలు, మూతలు మూటినవి, ఒక దాని మీద ఒకటి పెట్టి ఉండటం కనబడింది. సాంబుడు వాటిని పైకి ఎత్తి, గొయ్యి పూడ్చేసి, బిందెలను ఇంటికి తీసుకు పోదా మనుకుంటూం డగా, ఒక చెట్టు చాటునుంచి ఉద్దీపుడు తొంగి చూసి, "చూశాను! చూశాను!" అని వెళ్ళిపోసాగాడు.

ఉద్దీపుడు చూశానన్నది బిందెలను కాదు, సాంబుడి ముఖాన్ని. ఆ రోజు మామూలు వేళకు సాంబుడి ముఖం కనిపించక పోయేసరికి వాడు సాంబుణ్ణి వెతుక్కుంటూ చెట్లలోకి వచ్చాడు.

కాని సాంబుడు, బిందెల రహస్యం ఉద్దీపుడికి తెలిసిపోయిందని భయపడి, ఒక బిందె వాడికిచ్చి, "ఈశ్వర ప్రసాదం! ఒక బిందె నాకూ, ఇంకొకటి నీకూ!" అన్నాడు.

అయితే ఈశ్వర ప్రసాదం ఇద్దరికీ సమంగా దక్కలేదు. సాంబుడి బిందెనిండా చిల్లపెంకులే. ఉద్దీపుడి బిందెలో నూరు బంగారు కాసులున్నాయి!

ఉద్దీపుడికి ఆ కాసుల బిందె ఈశ్వర ప్రసాదంగా దొరికిందని తెలియగానే వాడి తండ్రి నాస్తికత్వం వదిలేసి భక్తుడైపోయాడు.





# ఓర్వలేనితనం

ఒక గ్రామంలో అన్నమయ్య అనే పేదవాడొకడు ఉండేవాడు. అతనికి ఇల్లూ వాకిలీ లేదు, చుట్టపక్కాలు లేరు. ఒంటరిగాడు, చాలా మంచివాడు. ఎవరే పని చెప్పినా చేసిపెడుతూ, చిన్నా పెద్దా అన్న విచక్షణ లేకుండా అందరితోనూ మంచిగా మాట్లాడుతూ, అందరి చేతా మంచి వాడనిపించుకుంటూ ఉండేవాడు. ఏ ఇల్లాలో ఇంత పెడితే తిని, ఎవరి పంచలోనో పైపంచె పరుచుకుని నిద్రపోతూ, నిర్విచారంగా కాలం వెళ్ళబుచ్చుతున్నాడు అన్నమయ్య.

అన్నమయ్యంటే ఊళ్ళో ఆబాలగోపాలానికీ ఇష్టమేగాని ఒక్క పూర్ణయ్య అనే వాడికి మాత్రం చాలా కసిగా ఉండేది. పూర్ణయ్య కాస్త కలిగినవాడు. తనకు ఏవో చీకులూ, చింతలూ ఉండటమూ, అన్నమయ్యకు ఎప్పుడూ ఏ చింతా లేక పోవటమూ, అందరూ వాణ్ణి భట్రాజులల్లే పొగడటమూ చూసి పూర్ణయ్య ఓర్చలేక పోయాడు. అన్నమయ్య మీద ఏదైనా ఒక అభాండం వేసి, నలుగురిచేతా వాణ్ణి తిట్టించాలని పూర్ణయ్యకు మహా కోరికగా ఉండేది. కాని అందుకు ఎటువంటి అవకాశమూ దొరకనే లేదు పూర్ణయ్యకు.

ఒకసారి ఏదో పండగ వచ్చింది. పూర్ణయ్య పండగకు బట్టలు కొనుక్కుందామనుకుని, కొంత డబ్బు జేబులో వేసుకుని పెందలాడే సంతకు బయలుదేరాడు. ఊరు దాటగానే అన్నమయ్య కనిపించాడు.

"ఎక్కడికిరా, అన్నమయ్యా?" అని పూర్ణయ్య అడిగాడు.

"కరణంగారు సంతలో సామాన్లు కొనుక్కు రమ్మన్నారు. అందుకు వెళుతున్నాను," అన్నాడు అన్నమయ్య.

"నేనూ సంతకే పోతున్నా. తోడుగా నడుద్దాం పద," అన్నాడు పూర్ణయ్య.

ఇద్దరూ కలిసి దారే నడిచేటప్పుడు పూర్ణయ్య బుర్రలోకి ఒక దురాలోచన వచ్చింది. ఆ ఆలోచన ప్రకారం చేస్తే అన్నమయ్యను ఊళ్ళోవాళ్ళచేత తిట్టించ వచ్చు ననుకున్నాడు. అన్నమయ్య మీద కసి తీర్చుకోవటానికి ఇటువంటి అవకాశం మళ్ళీ దొరకదని అతనికి తోచింది.

ఎండ నడినెత్తికి వచ్చాక పూర్ణయ్య అన్నమయ్యతో, "ఇంక పోవలిసిన దూరం ఎంతో లేదు. ఈ చెట్ల నీడన కాస్సేపు నడుము వాలుద్దాం," అన్నాడు.

అన్నమయ్యకు కూడా ఆ ఆలోచన నచ్చింది. వాడు తన పై పంచె చెట్లనీడన పరిచి పడుకుని, నిర్విచారప్రాణి కావటం చేత వెంటనే గాఢనిద్రలో మునిగాడు. పూర్ణయ్య చల్లగా అతడి జేబులోంచి డబ్బు తీసి తన జేబులో పెట్టుకున్నాడు.

పూర్ణయ్య ఈ పని దురాశతో చేసినది కాదు. అన్నమయ్య సంతలో కరణంగారి సామాన్లు కొనలేకపోయి చివాట్లు తింటాడు. కొందరైనా వాడికి దొంగతనం అంటగట్టు తారు. అన్నమయ్యకు ఒక వేళ తన మీద అనుమానం తగిలినా తనకు దొంగతనం అంటగట్టటానికి సాహసించడు.

అన్నమయ్య నిద్రపోతూండగానే తాను వెళ్ళిపోతే తన మీద అనుమానం కలిగే



అవకాశం ఉన్నది. అందుచేత సంత దాకా వాడితో కలిసే వెళ్ళి, అక్కడ చీలిపోవటం మంచి దనుకుని, పూర్ణయ్య కూడా నడుము వాల్చాడు. కొద్దిసేపట్లో అతనికి నిద్రపట్టింది.

వాళ్ళు పడుకున్నచోట చెట్టుమీద రెండు కోతులున్నాయి. పూర్ణయ్య అన్నమయ్య జేబులో నుంచి డబ్బుతీయటం అవి గమనించాయి. కోతిబుద్ధి గనక, పూర్ణయ్య నిద్ర పోగానే, ఒక కోతి చెట్టు దిగి వచ్చి పూర్ణయ్య జేబులో ఉన్న డబ్బంతా తీసి అన్నమయ్య జేబులో పెట్టి పైకి ఎక్కిపోయింది. గొప్ప పని చేసినట్టు కోతులు నవ్వుకున్నాయి.

తరవాత కాస్సేపటికి అన్నమయ్యా, పూర్ణయ్యా కూడా ఒకేసారి నిద్రలేచి, బయల్దేరుదా మనుకుంటే, బయల్దేరుదా మనుకున్నారు. ఇద్దరూ సంత చేరుకోగానే పూర్ణయ్య, "ఇక నీ పని నువ్వు చూసుకో, నా పని నేను చూసుకుంటాను," అని జారుకున్నాడు.

అతను ఒక బట్టల దుకాణానికి వెళ్ళి పంచెలచాపులు రెండు బేరం చేసి, డబ్బు ఇవ్వటానికి జేబులో చెయ్యిపెడితే జేబు ఖాళీగా ఉన్నది!

అన్నమయ్య కరణంగారికి కావలిసిన సరుకులన్నీ కొని, జేబులో చూసుకుంటే, కరణంగారిచ్చిన డబ్బు కాక ఇంకా చాలా ఉన్నది. వాడు దానితో తనకు బట్టలు కొనుక్కుని ఊరికి తిరిగి వెళ్ళిపోయి, కరణంగారితో, "ఇవాళ నా అదృష్టం ఏం చెప్పను? ఎట్లా వచ్చిందో నా జేబులోకి బోలెడంత డబ్బు వచ్చింది! పండక్కి బట్టలు కొనుక్కున్నాను!" అన్నాడు.

పూర్ణయ్య వట్టి చేతులతో కాళ్ళీడ్చుకుంటూ గ్రామానికి తిరిగి వచ్చాడు. తన డబ్బు పోయిందని అతను ఎవరితోనూ చెప్పలేదు; అన్నమయ్య వంటి వాడికి ద్రోహం తలపెట్టినందుకు తనకు మంచి శాస్తి అయిందనుకుని ఊరుకున్నాడు.





# కృష్ణావతారం

రుక్మిణికి మర్నాడు జరగనున్న వివాహం గురించి చెప్పి నారదుడు వెళ్ళిపోగానే, కృష్ణుడు తన వారితో, "నారదమహాముని మన శ్రేయస్సు కోరి చెప్పిన మాటలు మీ రంతా విన్నారు కద! ఇంక ఆలస్యం దేనికి? పనికి ఉపక్రమించుదాం - వెంటనే బయలుదేరి కుండిన పురానికి పోదాం. మీ మీ వాహనాలనూ, సేనలనూ ఆయత్తం చేసుకోండి. బలగం బయలుదేరేటప్పుడు ముందు సాత్యకీ, మధ్యలో బలరాముడూ, చివరలో ఉగ్రసేన మహారాజూ ఉండేటట్టు చూడండి. నేను దారకుణ్ణి వెంట తీసుకుని, శమస్తమైన ఆయుధాలతో సహ ముందు వెళ్ళి, ఆ శిశుపాలుడూ, రుక్మి, జరాసంధుడూ మొదలైన వాళ్ళ సంగతి అంతు చూసి, రుక్మిణిని సంపాదించుకుంటాను," అన్నాడు.

ప్రయాణ దుందుభి మోగించారు. యాదవులందరూ ఆర్భాటంగా ప్రయాణ సన్నాహాలు చేశారు. కృష్ణుడు తృప్తిపడి, తనను తాను చక్కగా అలంకరించుకుని రథంలో బయలుదేరాడు.

అతను పెళ్ళికొడుకు లాగా, మహా వైభవంతో ప్రయాణం చేసి, విదర్భదేశం చేరి, కుండిన పురాన్ని చేరబోతూండగా, రుక్మిణి తండ్రి అయిన భీష్మకుడు ఎదురు వచ్చి, ఆదరించి, నగరం బయట ఉన్న విడిదికి తీసుకుపోయి, అతిథి మర్యాదలన్నీ చేశాడు.

పెళ్ళికి వచ్చిన రాజులందరూ కృష్ణుణ్ణి చూసి రకరకాలుగా మాట్లాడుకున్నారు.

## 17. రుక్మిణి అపహరణం





మీద వర్షం పడినంతగా పరమానంద మయింది. "నన్ని కష్టాల నుంచి ఉద్ధరించటానికే కృష్ణుడు వచ్చాడు, అందుకు సందేహ మేమీ లేదు. నా జన్మ నిజంగా తరించింది, నా కోరిక ఈడేరింది. అతన్ని ఎప్పుడు కళ్ళ చూస్తానో!" అనుకున్నదామె.

ఆమె కృష్ణుణ్ణి గురించి రకరకాలుగా ఊహించుకో నారంభించింది; చెలికత్తెలతో అతని కథలు మళ్ళీ మళ్ళీ చెప్పింది; ఆమెలో ముందుండిన దైన్యమంతా పోయి కొత్త కళ వచ్చింది.

కృష్ణుడు కూడా మిగిలిన విషయా లేవీ పట్టించుకోక రుక్మిణిని గురించిన ఆలోచనలలో మునిగిపోయాడు. ఆమెను తాను ఎలా చూస్తాడు? ఆమెను ఎలా అపహరిస్తాడు? తనకు అడ్డపడే శత్రువుల నందరినీ ఎలా ఎదుర్కొంటాడు? ఇంతకూ ఆమెకు తన మీద మనస్సున్నదని విన్న మాట నిజమో కాదో ఎలా తెలుసుకోవటం?

"ఏమైనా కానీ, ఆమె నా కేసి అపేక్షగా చూసిందో, దేవతలు అడ్డపడేదిగాక, ఆమెను తప్పక సంపాదిస్తాను," అనుకున్నాడతను.

తెల్లవారింది. తేనెటీగలు పద్మాల మీదికి ముసిరాయి. చక్రవాకాలకు గుడ్డి తనం పోయింది. హంసలు కొలనుల్లో విహరించ

"శిశుపాలుడు కృష్ణుడికి మేనత్త కొడుకేగా? అతని పెళ్ళిగదా అని చూడ వచ్చి ఉంటాడు," అన్నారు కొందరు.

"అదంతా ఏమీ లేదులే. ఈ కృష్ణుడికి జరాసంధ శిశుపాలు లంటే ఏ మాత్రమూ పడదు. అటువంటి వాడు ఎందుకు వచ్చినట్టు?" అన్నారు మరి కొందరు.

"అన్నట్టు, ఆ రుక్మిణికి కృష్ణు డంటే చాలా ప్రేమ అని చెప్పుకున్నారే?" అన్నారు మరి కొందరు.

యాదవుల నందరినీ వెంట బెట్టుకుని కృష్ణుడు వచ్చాడని వినగానే రుక్మిణికి, వేసవి ఎండలకు తెగ కాలి ఉన్న భూమి







సాగాయి. కలువలు ముడుచుకు పోయాయి. సూర్యోదయమయింది. కృష్ణుడు కాల కృత్యాలు తీర్చుకుని, చక్కగా అలంకరించుకుని, తన పరివారాన్ని వెంట బెట్టుకుని, విడిది నుంచి రథం మీద బయలుదేరాడు. రుక్మిణిని చూడాలన్న కోరిక అతన్ని తీవ్రంగా ఆవేశించింది.

రాజసౌధంలో రుక్మిణిని చెలికత్తెలు చక్కగా అలంకరించి ముస్తాబు చేశారు. అలంకరణ పూర్తి కాగానే ఆమె ఒక బంగారు పల్లకీలో ఎక్కి, చెలికత్తెలు వెంట రాగా, నగరం వెలపల ఉండే గౌరీదేవిని అర్చించి రావటానికి బయలుదేరింది. ఆమె ఆలయం దగ్గిర పల్లకి దిగి, లోపలికి చెలికత్తెల మధ్య నడిచి వెళ్ళి, దేవికి మొక్కి, "తల్లీ, నాకు కృష్ణుడే భర్త అయేటట్టు అనుగ్రహించు," అని ప్రార్థించింది.

రుక్మిణి గౌరిఆలయం నుంచి బయటికి వచ్చే సమయానికి కృష్ణుడు అక్కడికి వచ్చి, మొట్ట మొదటిసారిగా ఆమెను చూశాడు. ఆమె అప్పుడే పాలసముద్రం నుంచి పైకి వచ్చిన లక్ష్మిలాగా అతనికి కనబడింది. బ్రహ్మసృష్టిలో అంతటి సౌందర్యవతి మూడు లోకాలలో చూసినా ఉంటుందని అతనికి తోచలేదు. ఆమెను గురించి విన్నదానితో కలిగిన ఉద్రేకాన్ని ఎలాగో భరించాడు గాని, ఆమెను కళ్ళ ఎదట చూస్తూ ప్రేమోద్వేగాన్ని నిగ్రహించుకోవటం అతనికి సాధ్యంగా కనబడలేదు.

రుక్మిణిని తన దాన్ని చేసుకోవటానికి తగిన చోటూ, సమయమూ దైవికంగా అతనికి కలిసి వచ్చాయి. ఇలాంటి అవకాశాన్ని పోగొట్టుకోవటం అవివేకం అని అతను తనలో అనుకున్నాడు.

ఇదే సమయంలో రుక్మిణి కూడా కృష్ణుణ్ణి మొదటిసారిగా చూసింది. అతనే కృష్ణుడని చెలికత్తెలామెకు చెప్పారు. ఆమె అతనికేసి ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసింది.







కౌగలించుకుని, ఎత్తి తెచ్చి తన రథం మీద పెట్టాడు. రుక్మిణి చెలికత్తెలు కంగారు పడ్డారు. సమీపంలో ఉండే భటులు కృష్ణుడి మీదికి రాసాగారు. బలరాముడు చెట్టొకటి పీకి, మీదికి వచ్చే రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ, సైనికులనూ చావమోది, చెల్లా చెదరు చేశాడు.

ఈ ఆర్భాటం విని, ఉగ్రసేనుడూ, సాత్యకీ, శతద్యుమ్నుడూ, విదూరథుడూ, ప్రసేనజిత్తు మొదలైన యదువృష్ణి భోజాంధక వీరులు తమ తమ బలాలతో వచ్చి బలరాముడికి అండగా నిలబడి, కృష్ణుడితో, "నువ్వా పిల్లను తీసుకుని ద్వారకకు వెళ్ళి పో. ఇక్కడ ఉండే వాళ్ళందరి సంగతీ మేము చూసుకుంటాం," అన్నారు.

వీరంతా యుద్ధానికి సిద్ధపడుతూ ఉంటే, రుక్మిణి అంగరక్షకులైన భటులలో చావగా మిగిలిన వాళ్ళు వెళ్ళి, రుక్మిణి అపహరణం గురించి భీష్మకుడికీ, జరాసంధుడికీ, శిశుపాలుడికీ, వారి వెంట వచ్చిన రాజులకూ తెలిపారు. అందరూ ఈ వార్త విని ఆశ్చర్యపడుతూ, "ఇంతమంది మహా యోధు లిక్కడ ఉండగా కృష్ణు డింత పని చేశాడే! వాడి కెంత పొగరు, ఎంత సాహసం, ఎంత ధైర్యం!" అనుకున్నారు.

ఇంతకాలమూ తాను విడవకుండా ధ్యానం చేస్తున్నవాడు అకస్మాత్తుగా తన కళ్ళ ముందు కనిపించేసరికి ఆమెకు ఆశ్చర్యమూ, కంపమూ, ఆనందమూ ఒకేసారిగా కలిగాయి. ఆమె కళ్ళు చల్లగా చెమ్మగిల్లాయి. సమాధిస్థితి లోకి వెళ్ళి పోయిన యోగిలాగా ఆమె తనను తానే మరచి పోయింది. ఆమె అలా అయిపోవటం చూసి చెలికత్తెలు భయపడ్డారు.

ఇంతలో బలరాముడు వచ్చి కృష్ణుణ్ణి కలుసుకున్నాడు. కృష్ణుడు తాను చేయదలచిన పనిని గురించి తన అన్నకు సంగ్రహంగా చెప్పి, రుక్మిణిని అమాంతంగా







జరాసంధుడు కోపంతో దహించుకు పోతూ, కళ్ళ నిప్పులు రాల్చుతూ, "ఒక గొల్లవాడి కొడుకు మహా జగదేక వీరుడల్లే వచ్చి నా ప్రయత్నమంతా పాడు చేశాడు. నేను నా సేనతో సహా బయలుదేరి వెళ్ళి వాడి మీద దాడి చెయ్యబోతున్నాను. ఇష్టమైతే మీరు కూడా సహాయం రండి," అని మిగిలిన వారితో అన్నాడు. సముద్రమే కోటగా గల ద్వారకలో ప్రవేశించినా సరే, కృష్ణుణ్ణీ అతడి బంధువుల నందరినీ హతమార్చి, ద్వారకను ధ్వంసం చేసి, రుక్మిణిని తెస్తానని ఆ జరాసంధుడు ప్రతిజ్ఞ చేశాడు.

పౌండ్రక వాసుదేవుడు జరాసంధుణ్ణి వారిస్తూ, "నీ భృత్యుణ్ణి నే నుండగా నీ కెందుకు శ్రమ? నేను వెళ్ళి, ఆ కృష్ణుణ్ణి ముక్కలు ముక్కలుగా నరికి, అడవి పక్షులకు ఆహారంగా వేస్తాను. భూమి మీద ఇద్దరు వాసుదేవు లెలా ఉంటారు? ఈ పొరపాటు సరి చెయ్యటానికీ, నీకు ఆనందం చేకూర్చటానికీ గొప్ప అవకాశం నాకు దొరికింది. ఇంకేం కావాలి?" అన్నాడు.

అంతలోనే శిశుపాలు డొక పెద్ద పరిఘ చేత-బట్టి నిలబడి, అందరూ వినేటట్టుగా, "ఆగండి! ఎవరూ కదలవద్దు! ఈ అవమానం నాది. పెళ్ళి చేసుకుందామని ఉబలాటంతో వచ్చి చివర కిలా భంగపాటు పొందిన వాణ్ణి నేను. ఈ ఒక్క పరిఘతోనే ఆ కృష్ణుణ్ణీ, మిగిలిన యాదవులనూ రూపుమాపి, జరాసంధుడి భృత్యుడుగా గొప్ప కీర్తి సంపాదించుకుంటాను. నిజంగా క్షత్రియుడైనవాడు మరొకడి భార్య కోసం ఇలా ఆశపడతాడా? ఈ యాదవ గోత్రీకుడు చాలా హీనుడై ఇలా చేశాడు. వాడు పెరిగినది వావీవరసాలేని పశువుల మధ్య. అందుచేత, కృష్ణుణ్ణి చంపి రుక్మిణిని తీసుకు రావటం నా పని," అన్నాడు

తరవాత జరాసంధుడు మొదలైన రాజులందరూ, కవచాలు ధరించి, రథా లెక్కి,





యుద్ధసన్నద్ధులయారు. అదే విధంగా సేనలన్నీ భేరీలూ, శంఖాలూ మొదలైన వాద్యాలు మోగించుకుంటూ అట్టహాసంగా బయలుదేరాయి. త్వరలోనే వారు, రథం మీద రుక్మిణిని ఉంచుకుని పోతున్న కృష్ణుణ్ణీ, అతని వెనకగా పోతున్న యాదవ సేనలనూ చేర వచ్చారు.

బలరాముడు మొదలైన యాదవ వీరులు తమ సేనలను ఆపి, జరాసంధుడి బలాలతో యుద్ధం ప్రారంభించారు. యాదవ సేన చిన్నది, జరాసంధుడి సేనలు పెద్దవి. అయినా జరాసంధుడి సేనలోనే హెచ్చుగా రక్తపాతం జరిగింది. ఉభయ పక్షాల



వీరులూ ద్వంద్వ యుద్ధాలు చేశారు. సాత్యకీ, జరాసంధుడూ మహా దారుణమైన యుద్ధం చేశారు. శక్రదేవుడూ, అక్రూరుడూ కలిసి దంతవక్త్రుడితో యుద్ధం చేశారు. శిశుపాలుడు ముగ్గురు యాదవ వీరులతో ఒకేసారి పోరాడాడు. కృతవర్మకూ పౌండ్రక వాసుదేవుడికీ యుద్ధం జరిగింది.

అందరి కన్న బలరాముడు మహా భయంకరంగా శత్రునాశనం చేశాడు. అవతలి పక్షాన జరాసంధుడు కూడా చాలా దారుణంగా యుద్ధం చేశాడు. చివరకు బలరాముడే అతన్ని గదా యుద్ధంలో మూర్ఛపొగొట్టాడు. వెంటనే జరాసంధుణ్ణి అతని సారథి రథం మీద పెట్టుకుని, దూరంగా తీసుకుపోయాడు. అది చూసి సేనలు పలాయనం సాగించాయి. ఆ పారిపోయే వాళ్లను సాత్యకి మరింత తరిమాడు. సాత్యకి శంఖం పూరించటం విని కృష్ణుడు, జరాసంధుడు పారిపోయినట్టు గ్రహించి, తన పాంచజన్యాన్ని ఊదాడు.

కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకుపోతున్నాడన్న వార్త విని జరాసంధుడు మొదలైన రాజులు తమ విడిది నుంచి సైన్యాలతో సహా బయలుదేరే సమయంలోనే, రాజ భవనంలో ఉన్న రుక్మి కూడా ఆ వార్త





విని, మండిపడి, యుద్ధంలో కృష్ణుణ్ణి చంపి, రుక్మిణిని తీసుకురాకుండా తిరిగి నగరంలో అడుగు పెట్టనని తన తండ్రి ఎదటా, బంధువుల ఎదటా శపథం చేసి, గదుడూ, కైశికుడూ మొదలైన యోధులనూ, సేనలనూ వెంటబెట్టుకుని, యుద్ధ సన్నద్ధుడై బయలుదేరాడు. అతనితో బాటు దక్షిణ దేశాల రాజులు కూడా ఉన్నారు.

వారికి కృష్ణుడి రథం నర్మదా తీరం వెంబడి ఒంటరిగా నడుస్తూ అంత దూరాన కనిపించింది. రుక్మి మిగిలిన వారందరినీ వెనకనే వదిలేసి, అతి వేగంగా తన రథాన్ని తోలించి, కృష్ణుడి రథానికి ఎదురు వెళ్ళి, "ఎక్కడికి పోతావురా, గొల్లవాడి కొడకా! ఇతరుడి భార్యను అపహరించే వాడా! నేను రుక్మిని! విదర్భరాజు కొడుకును! ప్రాణాలు దక్కించుకో దలిస్తే రుక్మిణిని తక్షణం వదిలెయ్యి, లేదా నాతో యుద్ధం చెయ్యి," అంటూ కృష్ణుడి పైన బాణవర్షం కురిపించాడు. కృష్ణుడు క్షణంలో అతని సారథిని చంపి, అతని శరీరం నిండా బాణాలు గుచ్చాడు.

రుక్మి దుస్థితి చూసి దక్షిణదేశపు రాజులు తమ మిత్రుణ్ణి కమ్ముకుని కృష్ణుడితో యుద్ధానికి పూనుకున్నారు. కృష్ణుడికీ, వారికీ మధ్య తీవ్రమైన యుద్ధం జరిగింది. కొంత సేపటికి రుక్మి తిరిగి బలం తెచ్చుకుని, మరొక రథం మీద వచ్చి, కృష్ణుడిపై తల పడ్డాడు. కృష్ణుడు అతని రొమ్ములో దిగే లాగు మూడు బాణాలు కొట్టి, రుక్మిని మూర్ఛపోగొట్టాడు. నేల మీద స్పృహ తప్పి పడిపోయిన అన్నను చూసి రుక్మిణి కృష్ణుడి రథం మీద కూలబడిపోయి, దుఃఖించసాగింది.

కృష్ణుడు రుక్మిణిని కౌగలించుకుని, ఓదార్చి, రుక్మిని ఏమీ చేయనని అభయమిచ్చి, రథాన్ని తిరిగి వెనక్కు తిప్పించి, తన నగరానికి బయలుదేరాడు.





# అరణ్యపురాణం

## 20

ప్రాకారం కింద ఉన్న, శిథిలమైన అగడ్తలో కూర్చుని కావా, బాఘీరా ఆ మేఘాన్నే చూస్తున్నారు. మందగా ఉన్న మర్కటులతో తలపడటం అపాయమని ఆ ఇద్దరికీ తెలుసు.

"నేను పడమటి గోడ వద్దకు పోయి నేల వాలున జారి వస్తాను. మర్కటులు నా మీద వందల సంఖ్యలో పడే అవకాశం లేదు. అయితే—" అన్నాడు కావా.

"నాకు తెలుసు. భాలూ ఇక్కడ ఉంటే ఎంతో బాగుండేది. కాని ఏం చేస్తాం? చంద్రుడికి ఆ మబ్బు అడ్డం రాగానే నేను మిద్దె మీదికి పోతాను," అన్నాడు బాఘీర.

"వేట సాగాలి," అంటూ కావా పడమటి గోడ కేసి పాకుతూ వెళ్ళిపోయాడు.

చంద్రుడికి మబ్బు అడ్డొచ్చింది. బాఘీర చడీ చప్పుడూ కాకుండా మిద్దె మీదికి ఎక్కి వచ్చి, మౌగ్లీ చుట్టూ మూగిన కోతుల మీద పడి, ఎడాపెడా బాదసాగాడు.

మర్కటులు కోపంతోనూ భయంతోనూ హాహాకారాలు చేశారు.

"ఒక్కడే ఉన్నాడు! చంపండి, చంపండి!" అని ఒక మర్కటుడు కేక పెట్టాడు. కోతులు తుట్టెలు తుట్టెలుగా బాఘీర మీద వచ్చిపడి, రక్కటమూ, కొరకటమూ, పీకటమూ, లాగటమూ ప్రారంభించారు. అయిదారుగురు మర్కటులు మౌగ్లీని గట్టిగా పట్టుకుని, చలవ రాతి మంటపం కప్పు మీదికి ఈడ్చుకు పోయి, అందులోని కంత నుంచి లోపలికి తోసేశారు.

"అక్కడే ఉండు. నీ మిత్రులను చంపేసి వచ్చి నీతో ఆడుకుంటాం— ఈ లోపుగా విషపు పురుగులు నిన్ను

అట్ట చివరి బొమ్మ



చంపెయ్యకుండా ఉంటే!" అన్నారు మర్కటులు మౌగ్లీతో.

మౌగ్లీ పాము భాషలో, "మనమూ మనమూ ఒకటే!" అన్నాడు. మండపం లోపల ఉండే చెత్తాచెదారం మధ్యగా ఏవో పాకుతున్న చప్పుడూ, బుసకొడుతున్న చప్పుడూ వినవచ్చింది.

"పడగలు దించండి!" అని ఒక అరడజను పాముకంఠాలు పలికాయి. "కదలకు, తమ్ముడూ, మమ్మల్ని తొక్కగలవు!" అన్నాయా కంఠాలు మౌగ్లీతో.

చెక్కడపు గోడల రంధ్రాలలో నుంచి బయటికి చూస్తూ, వీలయినంత నిశ్చలంగా నిలబడి, బయట బాఘీరతో సాగే యుద్ధాన్ని ఆలకించాడు మౌగ్లీ. మర్కటులు మూకుమ్మడిగా వచ్చి బాఘీర మీద పడి అరుస్తూ, గుంజుతూ కిచకిచలాడుతూ పెనగులాడుతున్నారు. బాఘీర మెలికలు తిరిగిపోతూ తన శత్రువుల నుంచి తనను కాపాడుకొనటానికి ప్రాణాలరచేత పెట్టుకుని పోరాడుతున్నాడు.

బాఘీర ఒంటిగా రాడనీ, భాలూ ఎక్కడో సమీపంలోనే ఉండాలనీ మౌగ్లీ అనుకున్నాడు. అతను గొంతెత్తి, "నీళ్ళ తొట్టెల కేసి దొర్లు, బాఘీరా. నీళ్ళ తొట్టెల్లోకి దూకెయ్యి," అని కేక పెట్టాడు.

మౌగ్లీ కేక పెట్టటం వినగానే, అతను క్షేమంగా ఉన్నాడని తెలిసి, బాఘీరకు కొత్త ధైర్యం వచ్చింది. అతను ఎడా పెడా దెబ్బలు తీస్తూ, ఒక్కొక్క అంగుళమే నీళ్ళ తొట్టెల కేసి పోసాగాడు.

ఇంతలో, అరణ్యానికి సమీపంగా ఉన్న గోడ శిథిలాల దగ్గిర నుంచి భాలూ యుద్ధ హుంకారం వినబడింది. భాలూ, పాపం, తనకు సాధ్యమైనంత వేగంగానే వచ్చి చేరాడు. "వచ్చేశాను, బాఘీరా! పైకెక్కేస్తున్నాను! ఈ వెధవ రాళ్ళు కాళ్ళ కింద నిలవకుండా ఉన్నాయి! ఆగండిరా, మర్క

టాధములారా!" అంటూ భాలూ మిద్దె మీదికి వచ్చేశాడు.

అతను పైన కనబడటమే వ్యవధానంగా మర్కటులు మబ్బులాగా అతన్ని కమ్మేసి, మాయం చేశారు. భాలూ దొరికిన మర్కటుణ్ణల్లా తన ఇనప కౌగిట్లో నొక్కేశాడు.

నీటిలో ఏదో పెద్దరాయి పడిన చప్పుడయింది. బాఘీర నీటి తొట్టెలోకి దూకేసినట్టు మౌగ్లీ అర్థం చేసుకున్నాడు. మర్కటులు అతన్ని ఇక అందుకోలేదు. వాళ్ళు నీళ్ళమడుగు చుట్టూ మూగి, తల మాత్రం నీటి పైకి పెట్టి ఆయాసంతో రొప్పుతున్న బాఘీర కేసి చూస్తున్నారు—బాఘీర భాలూకు సాయం వచ్చే పక్షంలో అంతు కనుక్కోవాలని!

కావా ఆఖరు క్షణంలో పారిపోయినట్టు అనుమానం తగిలి బాఘీర పాములను అభయం కోరసాగాడు. ఆ కేక విని భాలూకు, ఒక వంక మర్కటులతో సతమతమవుతున్నా కూడా, నవ్వాగ లేదు.

అయితే కావా పారిపోలేదు. పడమటి గోడ పై భాగానికి చేరటానికి అతనికి ఇంత సేపు పట్టింది. అతను గోడ పై అంచును అందుకుని, అతి భారమైన తన శరీరాన్ని పైకి చేదుకొనేటప్పుడు గోడలోని గండశిల



వదులై కిందికి పడిపోయింది. ఆ గోడ పై భాగం నుంచి కోతులున్న చోటికి వాటమైన పల్లుడు! కావాకు అది ఎంతో ఉపయోగం. కావా తన శరీరం ప్రతి అంగుళమూ సరయిన పొంకంలో ఉన్నదీ లేనిదీ చూసుకునేటందుకు ఒకటి రెండుసార్లు తల నుంచి తోక దాకా మెలికలు తిప్పి, చాచి చూసుకున్నాడు.

భాలూతో యుద్ధం చేసే మర్కటులు యుద్ధం చేస్తున్నారు. బాఘీర ఉన్న నీళ్ల తొట్టె చుట్టూ ఉన్న మర్కటులు కోలాహలంగా అరుస్తున్నారు. గబ్బిలాయి "మాంగ్" పైన ఎగురుతూ, కింద జరిగే

దంతా అరణ్యవాసులకు వ్యాఖ్యానించి చెబుతున్నాడు. అరణ్యవాసులు యుద్ధ వివరాలను ఆసక్తితో ఆలకిస్తున్నారు. హాథీ గట్టిగా ఘీంకారం కూడా చేశాడు. అరణ్యంలో అక్కడక్కడా ఉండే మర్కటులు నిద్ర లేచి, మూకలు మూకలుగా చెట్లమార్గాల, శిథిలాలలో ఉన్న తమ వారికి అండగా పోరాటంలో పాల్గొనటానికి బయలుదేరి వస్తున్నారు. చుట్టుపక్కల అనేక మైళ్ళ మేర నిద్రపోయే పక్షులు మేలుకున్నాయి.

కావా తానున్న ఎత్తు నుండి బాణంలాగా దూకుతూ వచ్చాడు. అతను తలతో ఏ ప్రాణిని గాని మీటినప్పుడు అతని బరువైన శరీరం ఆ దెబ్బకు అంతులేని శక్తి నిస్తుంది. అది గునపం పోటే. నాలుగైదు అడుగుల కొండచిలువ మనిషి రొమ్మును తలతో మోటించిందంటే మనిషి అమాంతం కూలి పడిపోతాడు. కావా ముప్పై అడుగుల నిడివి గల కొండచిలువ!

కావా మొదటి పోటు భాలూ పైన మూగిన మర్కటుల మధ్య తగిలింది. మరి రెండో పోటుకు అస్కారమే లేదు. "కావా! కావా! పరిగెత్తండి! పరిగెత్తండి!" అని కేకలు పెడుతూ మర్కటులు చెల్లాచెదరుగా పారిపోయారు.

కావా ఏ నాటివాడు! అతన్ని గురించి ఎన్నో తరాల మర్కటులు పెద్దవాళ్ళ నుంచి ఎన్నో కథలు విన్నారు. కావా చీకటి దొంగ! వాడు నిశ్శబ్దంగా కొమ్మ వెంబడి పాకి వచ్చి, ఎంత లావు మర్కటున్నయినా పొట్టన బెట్టుకోగలడు! చెట్టు మీద ఒక ఎండు కొమ్మలాగా ఉండిపోయి, మోసగించ గలడు! వాడి శక్తికి అవధి ఏమిటో తెలిసిన మర్కటుడు గాని, వాడికి దొరికి ప్రాణాలతో బయటపడిన మర్కటుడు గాని లేడు. అందుచేత మర్కటులు చెల్లాచెదురుగా పారిపోయి, గోడలూ, గొబ్బెలూ, ఇళ్ళ కప్పులూ ఎక్కారు.



# 74. "డండర" ఆలయం

ఈజిప్టులోని ప్రాచీన నిర్మాణాలలో ఇది ఒకటి. ఈ ఆలయపు చావడిలో 24 స్తంభాలున్నాయి. ఈ కట్టడాన్ని, ఈజిప్టు పాలకులైన ఫరావోలు క్రీస్తుకు పూర్వం మొదటి శతాబ్దిలో నిర్మించారు. ఇది అంతగా శిథిలం కాకుండా ఇప్పటికీ నిలిచి ఉన్నది. ఈ ఆలయం గోడమీద క్లియొపాత్రా బొమ్మ ఉన్నది.



Photo by S. P. Bhardwaj



బహుమతి
పొందిన వ్యాఖ్య

తీయతేనియ బరువు

పంపినవారు:
జి. ఆర్. మూర్తి, కాకినాడ

Photo by S. P. Bhardwaj



బహుమతి
పొందిన వ్యాఖ్య

మోయలే ద్బ్రతుకు

పంపినవారు:
జి. ఆర్. మూర్తి, కాకినాడ.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 మార్చి నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తీయుతేనియ బరువు

రెండవ ఫోటో : మోయలే దీ బ్రతుకు

పంపినవారు : జి. రాధాకృష్ణమూర్తి,
ఆంధ్ర గ్రామసేవారాజ్య సంఘం, కాకినాడ.

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

కండనొప్పి
ఎంత ఎక్కువగా ఉన్నా
స్థానికమే

# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధినిపొందిన నమ్మకమైన గృహఔషధం.

అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ


TEACH YOUR CHILD
THE SAVING HABIT NOW...
WHILE LIFETIME
HABITS ARE BEING
FORMED.




ANDHRA BANK LTD

వస్తోంది!



గౌరి ప్రొడక్షన్స్ సమర్పించు

# పాల మనసులు

నిర్వహణ: క. భావనారాయణ దర్శకత్వం: S.S.R. శర్మ

# ఫోస్ఫోమిన్



శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.



సహనశక్తిని హెచ్చించును.

శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.




ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్

SQUIBB

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A /67 Tel



విజయయాత్రకు వస్తున్నది
విజయా వారి
వినూతన సృష్టి

# ఉమా చండీ గౌరీ శంకరుల కథ

రచన: పింగళి
సంగీతం: పెండ్యాల
కళ: గోఖలే. కళాధర్
పసుమర్తి
బుల్‌బులే
విజయ రిలీజ్

నిర్మాత-దర్శకుడు: కే.వి.రెడ్డి B.Sc. [Hons]

